# ఆంధ్రమహిళ

AM_JUL_1963_4_7







Andhra Mahila  July 1963 - 50 nP



# ఆంధ్ర మహిళ

మహిళాభ్యుదయ

మాస పత్రిక

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్
వ్యవస్థాపకురాలు

## ప్రకటనరేట్లు

(ఒకేరంగులో)

| | | | |
|---|---|---|---|
| నాలుగవ రేపరు పుట | ... | రు. | 100/- |
| లోపలి రేపరు పుట (2, 3) | ... | ,, | 80/- |
| లోపలి సాదా పుట | ... | ,, | 60/- |
| లోపలి అర్ధ పుట | ... | ,, | 30/- |
| పావు పుట | ... | ,, | 15/- |


## 'ఆంధ్రమహిళ'

(మహిళాభ్యుదయ మాసపత్రిక)

వ్యవస్థాపకురాలు:

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

విడి పత్రిక-50 నయాపైసాలు          సం॥ చందా - రూ. 6-00.

సేవాసంస్థలకీ, స్త్రీల క్లబ్‌లకీ, గ్రంథాలయాలకీ, విద్యాలయాలకీ, జీవిత సభ్యులకీ

సంవత్సర చందా- 3-రు.          వ్యక్తులకి- 6-రు.

చందా పైకము ఈ దిగువ అడ్రసుకు పంప ప్రార్థన.

మేనేజరు.

ఆంధ్ర మహిళ

7. ఎ. రోజరీ చర్చిరోడ్డు          శాంథోమ్, మద్రాసు-4



# ఆంధ్ర మహిళ

సంపుటి 19 జూలై 63 సంచిక 7

## విషయసూచిక

ముఖచిత్రం :

వాలెంటినా తెరిష్కోవా




ఆంధ్ర మహిళ

7 ఎ, రోజరీ చర్చిరోడ్, శాంథోమ్ మద్రాసు-4

# అవకుంఠనం తొలగింది

మదోద్ధతుడైన
కీచకుని నూద్ర
కవియ వచ్చింది
మావోచైనా....

అవకుంఠనం
జారి పడింది,
భారతమాత శాంత
గంభీర వదనం
బయలు పడింది,
శత్రుభయదమై–

సమైక్య భారతజాతి
సత్వం ప్రతిబింబిస్తూ,
చెక్కుచెదరని నిబ్బరంతో
కృతనిశ్చయం ప్రకటిస్తూ–
భారతమాత శాంత
గంభీరవదనం
బయలుపడింది,
శత్రుభయదమై–

చిరార్చితమైన
శ్రీ వదనం,
పురాణభారత
పుణ్యవదనం –
తారుణ్యము
తరుగనిది,
తారళ్యము
తొరగనిది –

భారతమాత
భవ్య వదనం
ప్రదీప్తమైంది,

దివ్య దృశ్యమై –
వేనవేలు
వదనములై
విశ్వరూపం
తాల్చింది,
భావైక్యత
ప్రస్ఫుటమై
భీమబలం
వేలార్చింది –

జవహర్ రాజర్షి
హృదయం పులకించింది.
'జై హింద్' విరావం
మిన్ను ముట్టింది –

స్వాతంత్ర్య ఉద్యమ
దీక్షలో
సాక్షాత్కరించింది,
దేవి నాడు–
సరిహద్దు ఉపద్రవ
పరీక్షలో
సందర్శన మిచ్చింది
తిరిగి నేడు–

జవహర్ రాజర్షి
హృదయం పులకించింది,
'జై హింద్' విరావం
మిన్ను ముట్టింది–

శ్లాఘించాడు, మన
సమర నేత
చైనా దగుయీ
మేలు సేత!

"మాలీ"




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 19 :: జూలై 1963 :: సంచిక 7

# నారీవిజయం

నేటి కల్లోల ప్రపంచం సాంఘిక రాజకీయ రంగముల దృష్ట్యా, జీవన విధానములో రెండు వర్గాలుగా చీలిపోయివుంది. ఏ వర్గానికా వర్గము తమదే ఋజుమార్గమని భావిస్తున్నది. వీరిలో ఏ ఒక్కరికీ చెందక, తమ క్షేమముతో పాటు యిరువురి శ్రేయమూ కోరుతూ, మానవులందరూ సుఖశాంతులతో వర్ధిల్లాలని వాంఛించే దేశాలవారు కొందరున్నారు. ఈ తటస్థులది మెల్లగా వినిపించే నైతికవాక్కు. బలవంతులు బల్లగుద్ది చెప్పినంత ధాటీగా వీరు పల్కలేరు. నేటి మానవుడు తన సాంకేతిక విజ్ఞానముతో ఈ భూతలాన్ని స్వర్గధామంగా చేయగల అవకాశాలు అనంతంగా కనపడుతున్నాయని వీరు పదేపదే విజ్ఞప్తి చేస్తున్నారు. ఈ తటస్థులవద్ద భస్మాసురశక్తి లేదు, పాశుపతాస్త్రమూ లేదు. మానవుని కడపటి మంచితనంపై విశ్వాసం నిలుపుకున్న అతిసామాన్యులు వీరు.

అణువిచ్ఛేదనతో అణుశక్తి రహస్యం తెలుసుకున్న రెండు కూటములూ, అణ్వాయుధోత్పత్తితో కొన్నాళ్లు బలాబలాలు చూసుకొని, ఆరేళ్ళక్రితం అంతరిక్షంవైపు దృష్టిని సారించాయి. మానవనిర్మిత ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి ప్రవేశపెట్టిన రెండున్నరేళ్ళకి, మొట్టమొదటిసారిగా మానవుడు (గగారిన్) వ్యోమనౌకాయాత్ర ముగించుకు వచ్చాడు. రష్యనులు తమకంటె ముందు వుండటమా అని అమెరికనులు తమ రోదసీ యాత్రీకుని (షెపర్డ్) అంతరిక్షంలోకి పంపారు. అంతరిక్ష విజయంతో యిరుపక్షాలవారూ చంద్రమండల ప్రయాణానికీ, వియత్తల ఆధిపత్యానికీ, రోదసీ స్థావరాల (స్పేస్-ప్లాట్‌ఫారమ్స్) నిర్మాణానికీ కృషిచేస్తున్నారు.

ప్రపంచశక్తుల ముష్టియుద్ధం యిలావుండగా, పదిరోజులక్రితం వున్నట్టుండి రష్యా దేశం ఒక వనితను గగనవిహారం చేసేందుకు పంపించింది. ఈమె 49 సార్లు గిరగిరా భూమండల ప్రదక్షిణం చేసింది. ఈమె కంటె రెండురోజులు ముందు అంత

రిక్షంలోకి పంపబడ్డ బైకొవ్‌స్కీ 82 ప్రదక్షిణాలు చేశాడు. ఈ పెళ్ళిగాని యువతీ యువకులు అంతరిక్షయాత్రలో ఒకరితో ఒకరు టెలిఫోను ద్వారా మాటామంతీ చెప్పుకున్నారట. శ్రీ క్రుశ్చేవ్ వారి అంతరిక్ష ప్రణయానికి శుభాక్షితలు వేసినట్లుగా కూడా వదంతి.

ఖగోళయాత్ర జయప్రదంగా ముగించుకు వచ్చిన ఈ మహిళ పేరు వాలెంటినా తెరిష్కోవా. వయసు ఇరవై ఆరు. తండ్రి రెండవ ప్రపంచయుద్ధపు ప్రారంభదినాలలో చనిపోయాడట. ముగ్గురు ఆడపిల్లలనూ తల్లే ఎంతో శ్రద్ధగా పెంచింది. వాలెంటినా తెరిష్కోవాని 'వాల్యా' అంటారు. అక్కచెల్లెళ్లలో ఈమె రెండవది. యంత్రపరికరాల కర్మాగారంలోనూ, బట్టలమిల్లులోనూ పనిచేస్తూ, తీరికసమయాలు వృధాచేయక, వైజ్ఞానిక కృషితోబాటు వైమానిక శిక్షణపొంది, ప్రత్యేకార్హతలూ దృఢత్వమూ మనోనిబ్బరమూ వున్నవారే ఎన్నికకు యోగ్యులు కాగల ఖగోళ యాత్రీకుల సమితిలో ప్రవేశం పొందగలిగింది. స్త్రీ సహజమగు మార్దవమూ, సౌజన్యమూ, స్నేహశీలతగల ఈ యిరవై ఆరేళ్ళ యువతి, నిరంతర స్వయంకృషితో, నిశ్చలచిత్తంతో అంతరిక్ష యాత్రీకులలో ప్రప్రధమ మహిళ కాగలిగింది.

యూరీ గగారిన్ ఈమె గురించి అంటాడు: "కనులలోని కరుణ, పెదవుల మీద చిరునవ్వు, మాటలో చేతలో సౌకుమార్యం ఆమెని మాకు ఆప్తురాలుగా చేసేవి. విఘ్నాలకు చెదిరేదికాదు; వైఫల్యాలకు బెదిరేదికాదు. వాల్యాలో గల నిండుతనం మా బృందానికే ఒక శోభను చేకూర్చిపెట్టింది."

వాలెంటీనా తెరిష్కోవా నారీలోకపు నూతన యుగోదయ శంఖారావం పూరించింది. ఎంతటి సున్నిత సాంకేతిక పరికరాల క్రమప్రయోగంలో తన కర్తవ్యతాభారం వున్నప్పటికీ, ఆ బాధ్యతని ఆధునిక యువతి అవలీలగా నెరవేర్చగలదని నరనారీజగత్తుకి మందస్మిత వదనంతో నిరూపించింది వాల్యా. ఈ రష్యన్ యువతి ఘనవిజయానికి ఆమెను కన్నతల్లి, ఆమెను పెంచి పెద్దజేసిన దేశమేగాక ప్రపంచ స్త్రీలందరూ హర్షపులకాంకితులయ్యారు.

రష్యన్ మహిళ యింతటి అద్భుతకార్యాన్ని విజయవంతంగా ముగించింది కదా, అమెరికన్ వనిత లెవరూ రష్యన్ సోదరి వరవడిని అనుసరించరా, వారిలో ఎవరూ యిటువంటి ప్రయత్నము చేయరా అని మనకొక ప్రశ్న కలగవచ్చు. ఎందుకు చేయరూ? చేయవచ్చు. కాని, అది భవిష్యత్తులో దాగివున్న రహస్యం. నేటి వాల్యా విజయానికి ఆంధ్రమహిళ, భారతమహిళ ధన్యవాదాలర్పిస్తున్నారు.

— మాలతీ చందూర్
గౌరవ సంపాదకులు

# ప్రాయశ్చిత్తం

జోగులమ్మగారింట్లో నల్లపిల్లి అతిగా ఎవర్నయినా అభిమానిస్తున్నదంటే అది ఆవిడగారి కోడలు లలితనే. లలిత ఆ యింట్లో విపరీతంగా ఎవర్నయినా ద్వేషిస్తున్నదా అంటే ఆ నల్లపిల్లినే. యిలాంటి అవినాభావసంబంధం చూసినవాళ్ళకి ఆశ్చర్యంగా కనిపించవచ్చు. అదేమరి విశేషం! అందుకే ఈ కథానూ.

పుట్టింట్లో అతిగారాబంగా పెరిగిన లలిత బిడియపడుతూనే అత్తింట పాదం పెట్టింది. క్రొత్త కాపురం కావడంచేత ఏ అడుగు ఎలావేస్తే ఏం ప్రమాదం వస్తుందోననే భయమూ; ఏ పనిలో ఏ లోపం జరిగితే ఎవరేమనుకుంటారోననే దిగులూ లలితను అనుక్షణమూ వేధిస్తూనే వున్నాయి.

అయితే లలిత భర్త సుందర్రావు భార్య గత సుకుమార జీవితాన్ని ముందుగా తెల్సుకున్నవాడు కావడంచేత, ఆమె సున్నితమైన హృదయాన్ని నొప్పించకుండా తప్పించుకు తిరుగుతున్నాడు. ఇక జోగులమ్మగారు సరేసరి. కోడలు నట్టింట్లో అడుగు పెట్టడంతోనే ఆమె సంతోషానికి మేరలేకపోయింది. ఆవిడ లలితను కన్నకూతురుకంటె ఎక్కువగా అభిమానించసాగింది. పైగా, లలిత రావడంతోనే తను ఈ సంసార బాదరబందీల నుంచి విముక్తురాలై శేషించిన జీవితాన్ని భగవంతుని కైంకర్యం చేయాలన్న తలంపుతో యింటి తాళాల్ని కోడలు కొంగున ముడివేసి, కోడల్ని ఆ యింటి సామ్రాజ్ఞిగా చేసేసింది.

లలిత అత్తవారింటికి రావడంతోనే ఎదురైన పరిస్థితి యిది.

వస్తూనే తానిలాంటి పరిస్థితి నెదుర్కోవల్సి వస్తుందని లలిత ఎప్పుడూ వూహించనేలేదు. సంసారాన్ని చక్కదిద్దుకోవడం మాటలతో పనికాదు. ఆమెకు గతంలో అనుభవమూలేదు. అనుభవ శూన్యురాలైన తను ఒక్కసారిగా యిన్ని బాధ్యతలను నెత్తిన వేసుకుని, సంసారభారాన్ని మోయడం, రెండో ప్రాణికి నొప్పికలుగకుండా నెట్టుకురావడం ఆ వయస్సులో ఆ పరిస్థితుల్లో ఎంత కష్టమో వివరించనక్కర్లేదు. ఆ స్థితిలో లలిత భయపడుతూందనడంలో అతిశయోక్తి అంతకన్నాలేదు.

లలిత అసహాయతను చూసి అందరూ సానుభూతి చూపుతున్నా, ఒక్క ప్రాణిమాత్రం ఆమె నిస్సహాయతను అవకాశంగా తీసుకుని లాభంపొందడం జరుగుతోంది. అందుకే నిస్సహాయురాలైన లలితంటే అంత అభిమానం.

ఆ ప్రాణి ఎవరు?

ఆ యింట్లో నల్లపిల్లి!

లలిత యింటిపనుల హడావుడిలో పొరపాటున వంటింటి తలుపులు చేరవేయడం మరిస్తే చాలు–అవకాశంకోసం పొంచివున్న నల్లపిల్లి వంటింటి నంతా చక్కబెట్టేసేది. ఎన్నో రోజుల్నుంచి కష్టపడి తీసి దాచిన వెన్నముద్దనంతట్నీ కలికంలోకి కూడా మిగలకుండా కాజేసేది. అత్తగారికోసం అభిమానంతో వండిన ఫలహారాలు కన్నుచాటైతే చాలు-నల్లపిల్లి కడుపులో చోటు చేసుకున్న సమయాలు కూడా కద్దు. వలపులాంటి చిక్కని పాలలో ప్రేమవంటి పంచదారని కలిపి భర్తకోసమని పడకగదిలో వుంచితే, చీకట్లో చాటుగావచ్చి కడుపార ఆరగించిన సందర్భాలు లలిత కళ్ళారా చూసినప్పుడు ఆమె హృదయం ఎంతగా దహించుకుపోయేదో పాపం!

యిలా నల్లపిల్లి గొప్పతనాన్ని చెప్పుకుంటూపోతే దానికి అంతంటూ లేదు. యింతటి పెద్దగాయాల్ని భరిస్తూవున్న లలితకు నివారణోపాయమూ కనిపించడం లేదు. నల్లపిల్లి ప్రతి చేష్ట లలితకు ఆగ్రహాన్ని కలిగిస్తూవుంటే, నల్లపిల్లి మాత్రం ఘన విజయంగా భావిస్తూ చెంగులేస్తోంది.

అంతకు ముందయితే జోగులమ్మగారి హయాంలో నల్లపిల్లి నట్టింట ఎంతచనువుగా తిరిగినా ఆమె ఆటలు సాగేవి కావు. అలాంటి అవకాశాలూ దొరికేవికావు. యిప్పుడు లలిత యింటికి యజమానురాలు కావడంతో నల్లపిల్లి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు దొరికినంతగా ఆనందిస్తోంది. అంతవరకూ పరాధీనయైవున్న తనకు వచ్చీ రావడంతోనే స్వేచ్ఛను ప్రసాదించినందుకు కాబోలు లలితంటే నల్లపిల్లికి అంత అభిమానం!

నల్లపిల్లి సంగతెలావున్నా, లలితకు ఆమె ఉనికే ప్రాణసంకటంగా తయారైంది. అత్తగారిపోరు, ఆడపడుచుల సాధింపులు తనకు లేకపోయినా, నల్లపిల్లి ప్రవర్తన లలిత హృదయాన్ని గాయపరుస్తూనేవుంది. మొదట్లో అయితే, నట్టింట్లో చనువుగా తిరుగుతున్న పెంపుడు జంతువుకదా అని సానుభూతి వహించేది. లలిత మంచితనాన్నీ, ప్రేమాభిమానాల్నీ బలహీనంగా తీసుకుని, నల్లపిల్లి మరింత అతిగా ప్రవర్తించడంతో లలితలో ఓర్పు నశించిపోవడమేగాక, ద్వేషం మొలకెత్తింది. తన మంచితనంతో ప్రేమాభిమానాలతో అందరిహృదయాల్లో స్థానాన్ని ఆక్రమించుకోవాలని తాపత్రయ పడుతున్న లలితకు, తను చేసే ప్రతీపనిలోనూ నల్లపిల్లి అడ్డు తగుల్తుండడంతో, ఆమెలో ద్వేషంకూడా పెరిగిపోయి కర్కశత్వంగా మారిపోయింది.

యిలాటి వాతావరణంలో అసలు పరిస్థితి ఏమంటే ఆ యిద్దరు బద్ధవైరులుగా తయారైనారు. అవకాశం దొరికితే చాలు లలితను రాసి రంపానపెట్టి తన గొప్పతనాన్ని ప్రకటించుకోవాలని పట్టుబట్టింది నల్లపిల్లి. కంటపడితేచాలు శక్తిని రుచి చూపించి నల్లపిల్లికి బుద్ధి చెప్పాలని నిశ్చయించుకుంది లలిత.

యిలా ఒకరిమీద ఒకరు నిఘావేసి వుండడమేకాక, 'ఎమర్జన్సీ' కూడా 'డిక్లేర్' చేశారు. తదనుగుణంగా కావల్సిన జాగ్రత్తలు తీసుకోవడంతో పరిస్థితి పరాకాష్ఠ నందుకుంది.

ఎలాగైనా నల్లపిల్లిని పట్టాలన్న వుద్దేశంతో లలిత ఒక బోను తెప్పించింది. నల్లపిల్లికి యిష్టమైన పదార్థాలను అందులో వుంచుతూ నల్లపిల్లిని పట్టడానికి ఎన్నో ప్రయత్నాలుచేసేది. కాని, నల్లపిల్లి లలిత కంటె తెలివైంది కావడంచేత, ఆమె చేస్తున్న ప్రయత్నాలన్నీ ఒక కంటితో కనిపెడుతూనే వుండేది. ఆ బోనులో ఎంత యిష్టపదార్థాలున్నా దాని ఛాయలకైనా పోయేదికాదు.

నల్లపిల్లిని పట్టడం కోసం తను చేస్తున్న ప్రయత్నాలన్నీ వమ్మై అవుతుండడంతో లలిత పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారైంది. నల్లపిల్లిని వదిలించుకోవడం ఎలా అన్నది ఆమెకు అంతు చిక్కని సమస్య అయింది.

ఆరోజు సాయంత్రం భర్తకోసం టిఫినుచేసి, చిక్కటిపాలు కాచి వంటింట్లో గూట్లోవుంచి, ప్రక్కగదిలో అత్తగారి పూజకోసం ప్రత్తివొత్తులు చేయడంలో లీనమైంది లలిత. ఈ కార్యక్రమాన్నంతా పొంచి చూస్తూవున్న నల్లపిల్లి లలిత పరధ్యాన్నంలో వుండటం గమనించి, ఒక్క ఛెంగున గూటిలోనికి ఎగిరి గ్లాసుడు పాలను నేలపాలు చేసింది.

వంటింట్లో చప్పుడువిని లలిత ఆతృతగా వచ్చేసరికి నేలపాలయిన పాలను నల్లపిల్లి నిర్భయంగా నాకుతూ వుండడం లలిత కళ్ళపడింది. అంతవరకూ ధైర్యంగా పాలు జుర్రుతున్న నల్లపిల్లి లలిత రావడం చూసి బయటికి దాటిపోయింది. ఎదురుగా పగిలిన గ్లాసుముక్కలు నల్లపిల్లి విజయాన్ని సూచిస్తూ తనను పరిహాసంచేస్తున్నట్లుగా పడివుండడం లలితకు భరింపరాని దృశ్యంగా కనిపించింది. ఆమె శరీరంలో రక్తం వుడికిపోయింది. ఒంటిమీద తేళ్లూ, జెర్రిలూ ప్రాకినట్లు బాధపడింది. అడుగడుగునా నల్లపిల్లి తన నిలా కష్టపెడుతుండడంతో ఆమెలో క్షమాగుణం పూర్తిగా నశించిపోయింది. నల్లపిల్లిని ఎలా బదిలించుకోవాలన్న ఆలోచనలతో ఆ రాత్రి లలితకు కంటిమీద కునుకే లేదు. ఆ రాత్రి గడియారం కొట్టిన గంటలన్నీ లెఖ్ఖపెట్టింది లలిత. తెల తెలవారుతూంటే నల్లపిల్లి గది గుమ్మం దగ్గరకు వచ్చి తనకేసి గుడ్లు మిటకరించడం లలిత చూసింది. ఆ అవకాశాన్ని చేజిక్కించుకోవా

శ్రీ ఎ. ఎస్. రామారావు

లని లలిత సంకల్పించుకుని మెల్లగా లేచేసరికి, లలిత ప్రయత్నాన్ని పసిగట్టి నల్లపిల్లి పారిపోయింది.

నల్లపిల్లి అలా పారిపోవడం లలిత ఘోర పరాజయంగా భావించింది. కాని, ఎలానో ధైర్యాన్ని కూడ గట్టుకుని, పట్టుదల పెంచుకుంది. "యిక చూడు నా తడాఖా" అన్నట్లు లలిత పెదవులమీద చిరునవ్వు నిల్చింది. వెంటనే ఒకగ్లాసుతో పాలుతెచ్చి వంటింటి గుమ్మం ముందు వుంచి, నల్లపిల్లి రాకకోసం వంటింటి తలుపుచాటున కనిపెట్టుకుని వుంది లలిత.

లలిత వూహించినట్లుగా నల్లపిల్లి అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చింది. చుట్టూ లలిత వుందేమోనని చూసింది.

లలిత ఎక్కడా కనిపించకపోవడంతో ధైర్యంగా పాలగ్లాసును సమీపించింది. నల్లపిల్లి ఈ సారిమాత్రం లలిత వేసినపథకానికి లొంగిపోక తప్పలేదు. యిలాటి అవకాశంకోసం ఎన్నాళ్ళగానో కనిపెట్టుకున్న లలిత ఆనందానికి మేరలేకపోయింది. అంతలోనే ఆమెలో ద్వేషాగ్ని నాలుకలు కూడా చాచుకుంది. ఆ స్థితిలో ఆమె పాపపుణ్యాలను గురించి ఆలోచించలేకపోయింది. వచ్చిన అవకాశం చేజారిపోకుండా, కోపంలో ఒళ్ళు మరచి, దగ్గరనేవున్న సన్నికల్లు పోత్రాన్ని తీసి కసికొద్ది, తనయావచ్ఛక్తినీ వినియోగించి నల్లపిల్లి మీదకు గిరవాటేసింది.

నల్లపిల్లి అరవలేదు: మూలగలేదు. కదల్లేదు; మెదల్లేదు. వున్నదున్నట్లు చలనంలేకుండా నేల కూలిపోయింది.

లలిత విసిరిన పొత్రం-రాకెట్టును ప్రయోగించినప్పుడు వినిపించే శబ్దం, అణుబాంబు బద్దలైనప్పుడు కలిగే చప్పుడుకంటె ఎన్నోరెట్లు ఎక్కువగానే అయివుంటుంది! అప్పటికి ఆమె హృదయంలోంచి ఏదో పెద్దబరువు తొలిగిపోయినట్లు, ఏదో చిక్కుముడి విడిపోయినట్టు దీర్ఘంగా నిట్టూర్చింది లలిత.

తెల్లవారుతూనే నట్టింట్లోంచి అగ్నిపర్వతం బ్రద్దలైనట్లుగా చప్పుడు వినిపించడంతో పెరట్లో కళ్లాపు చేస్తున్న పనిమనిషి చీపురుకట్టను అలానే పడేసి పరుగెత్తివచ్చాడు. పెరట్లో తులసిపూజ చేసుకుంటున్న జోగులమ్మ అతృతగా వచ్చింది. వాళ్ళందర్నీ అక్కడి దృశ్యం కలవరపెట్టింది. లలిత హంతకురాలివలె,

# ధన్యజీవి

మిసెస్ పాల్ అప్పాసామి దివంగతురాలవడంతో దక్షిణ భారతంలోని సంఘసేవానురక్తుల తరమొకటి అంతరించిందని చెప్పవచ్చు. పూజ్యురాలైన ఈ విదుషీమణి పేరు ఈ శకంవారికి అంతగా పరిచితం కాకపోవచ్చు. కాని, మద్రాసులోని యావన్మందికీ 'విద్యోదయ' అను పేరు తెలుసు. అక్కడ బస్సులు ఆగడం వల్లనయితేనేమి, వందలాది విద్యార్థినులు చదువుకొనే పాఠశాలగానయితే నేమి, 'విద్యోదయ' అన్నది అందరికీ తెలుసు. ఈ 'విద్యోదయ' ని 1924 లో ముగ్గురు బాలికలతో ప్రారంభించి, నగరంలోని బాలికా విద్యాలయాలకు తలమానికంగా చేసిన కార్యదక్షురాలు శ్రీమతి పాల్ అప్పాసామి. మహాత్మాగాంధి ప్రియశిష్యులగు భరతన్ కుమారప్ప, జె. సి. కుమారప్ప ఈమె సోదరులు. 1878 లో దిండిగల్ లో జన్మించిన ఈమె, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో పట్టభద్రురాలై, పూనా సమీపానగల పండిత రమాబాయి అనాధశరణాలయంలో రెండు సంవత్సరాలపాటు అధ్యాపకురాలిగా పని చేశారు. ఆనాడు కలిగిన సేవాభావమే, తర్వాత వివాహితయై, పిల్లల తల్లియై, కుటుంబ బాధ్యతలతోబాటు స్త్రీ జనాభ్యుదయకరమగు కార్యక్రమాలలో పాల్గొంటున్నపుడు, ఆమె పుణ్యజీవితాన్ని దీప్తివంతం చేసింది. 85 సంవత్సరముల తనువు చాలించిన ఈ ధన్యజీవి ఆత్మకు శాంతి కలుగుగాక!



శిశువును భక్షించబోయే నేరస్థునివలె తలవంచుకు. భయంగా, గోడ మూలగా నిల్చునివుంది.

"అయ్యో రామ! ఏం దారుణం! ఏం దారుణం! నట్టింట్లో ఎంతటి దారుణ హత్యాకాండ జరిగింది! పైగా యజమానురాలే హత్యచేయడం మరీ విడ్డూరం" అంటూ పనిమనిషి నిప్పురాజేసింది.

ఆ అగ్గిలో వంటమనిషి ఆజ్యంపోస్తూ" నిజమే! యిది దారుణ హత్య అనడంలో సందేహంలేదు. పిల్లి అవనీ మనిషవనీ ప్రాణంతీయడానికి ఏదైనా ఒకటే ఈ పాప కర్మనుంచి ఈ యిల్లు విముక్తి పొందేవరకూ యింట్లో నిప్పురాజెయ్యను. లేకపోతే నాకు కూడా పాపం చుట్టుకుంది" అంటూ ప్రతిన పూనాడా వంట వాడు.

అసలే పూర్వాచార పరాయణురాలైన జోగు లమ్మ జరిగిన దారుణానికి చలించిపోతూ, ప్రేమకొద్ది కోడల్ని ఏమీ అనలేక "పాపాను! ఈ పాపానికి ప్రాయశ్చిత్తం జరిగేవరకూ మీరేకాదు- ఈ యింట్లో ఎవరూ మంచినీళ్ళు కూడా నోటపోసుకోకూడదు. తెలిసీ తెలిసీ ఎంతపని చేశావమ్మా లలితా!" అంటూ దిగులుపడింది జోగులమ్మ.

"పోనీండి జోగులమ్మగారూ! జరిగిందేదో జరిగి పోయింది. యిప్పుడిక కర్తవ్యమేమిటో ఆలోచించండి. అవధాన్లుగార్ని పిలిపిస్తే వారే చెబుతారు ఏం చెయ్యాల్సిందీను" వంటాయన సూచనచేశాడు.

"చెప్పి రమ్మంటారా?" అన్నట్టు చూసింది జోగు లమ్మగారి వంక పనిమనిషి.

ఆ పరిస్థితిలో జోగులమ్మకు "సరే" అనటంకంటె గత్యంతరం లేకపోయింది.

అప్పటికే నల్లపిల్లి మీద లలిత జరిపిన దారుణ కృత్యపువార్త ఆనోట ఆనోట ప్రాకి వీధంతా వ్యాపించిపోయింది. జోగులమ్మగారింట్లో జరిగిన దారుణాన్ని చూడాలన్న తలంపుతో వచ్చిన యిరుగు పొరుగు వాళ్ళందరితో నట్టిల్లు నిండిపోయింది. ఆ వచ్చిన వాళ్లంతా ఎవరికితోచిన సలహాలు వాళ్ళిస్తు న్నారు. కొంతమంది హత్యనుగురించీ, లలిత ప్రవర్తన నగురించీ ఘాటుగా విమర్శిస్తున్నారు. కొందరు తలనెరిసిన పెద్దలు అసలు విషయాన్ని ఆరా తీయ డానికి లలితమీద ప్రశ్నల వర్షాన్ని కురిపిస్తున్నారు.

లలిత మాత్రం యివన్నీ వింటున్నా వినిపించుకో నట్టే తల వంచుకుని ఒక మూలగా నిల్చుంది.

పొట్టిగా, లావుగా, చాకలి బానలాంటి బొజ్జను ఒక చేత్తో రాసుకుంటూ, మరొకచేత్తో కుచ్చులాటి పిలకను ఝాడిస్తూ వచ్చిన అవధాన్లుగారితో ప్రాయశ్చిత్త కర్మకాండను గురించి చర్చించడానికి సమావేశం ఆరంభమయింది. ఆ సందర్భంలో వలసిన నిర్ణయాలు చేయడానికిగాను అవధాన్లుగారు. జోగు లమ్మ, వంటాయన యిరుగుగింటి ఇందిరమ్మ, పొరుగింటి సుందరమ్మగార్లతో విషయనిర్ణాయిక సంఘం ఏర్పాటై చర్చలు ప్రారంభమయ్యాయి. అక్కడ చేరిన జనసమూహమంతా ఆ సమావేశానికి ప్రేక్షకులై, మధ్య మధ్య తమ సలహాలను కూడా యిస్తూ, తమలో తాము కూడా చర్చించుకుం టున్నారు పార్లమెంటు లాబీలోవలె.

ఇందిరమ్మగారు చర్చను ప్రారంభిస్తూ "పిల్లి హత్యాపాతకానికి ఎట్టి నరకం ప్రాప్తిస్తుందండి అవధానుగారూ?" అని అడిగింది.

(ఇంకా వుంది)



## అమెరికాలో

# ఉచిత విద్య

అమెరికా ఆగ్నేయరాష్ట్రం జార్జియా గ్రామీణప్రాంతంలోని రేబన్ గ్యాప్ - నెకూషీ స్కూలులో బాలబాలికలూ, వయోజనులూ పనులుచేస్తూ చదువులు సాగిస్తుంటారు.

అక్కడి సెకండరీ స్కూల్లో సంపాదించుకొంటూ చదువుకొనే ఈ కార్యక్రమం విజయవంతంగా అమలుజరుగుతున్నది. 1903 లో ఈ స్కూలు స్థాపించబడింది. దీనిలో చెప్పే చదువులు సాధారణ అమెరికన్ స్కూళ్లస్థాయిలోనే ఉంటవి. ఈ స్కూల్లో చదువుకొనే విద్యార్థులు స్కూలు ఫీజు, బోర్డింగు ఖర్చులు పనులుచేస్తూ సంపాదించుకొంటారు. వ్యవసాయం, భవనాల సంరక్షణ గృహసంబంధ కళలువంటి పనులు వారు చేస్తుంటారు. ఈ కార్యక్రమం వీళ్ళకు ఆర్థికంగా, తోడ్పడమే కాకుండా స్కూలు తన ఖర్చులు తగ్గించుకోటానికి కూడా ఉపయోగపడుతుంది. ఈ స్కూలులో 200 మందికి పైగా గల విద్యార్థులలో దాదాపు సగంమంది సంపాదిస్తూ చదువుకొనే కార్యక్రమంలో పాల్గొంటున్నారు.

"బోర్డింగులో ఉండే విద్యార్థులంతా - తమ ఖర్చులను భరించుకోగలవారైనా - పనులు చేస్తుంటారు," అని ఈ స్కూలు ప్రెసిడెంటు డాక్టర్ కోరల్ ఏండర్సన్ చెప్పాడు. "యువకులకు పనులలో అనుభవం సంపాదించటం అవసరమనీ అది సమాజాభివృద్ధికి దోహదకారి కాగలదనీ మా విశ్వాసం" అన్నారాయన.

రేబన్-గ్యాప్-నెకూషీ స్కూలుకు సొంత వ్యవసాయక్షేత్రం ఉన్నది. ఈ క్షేత్రాన్ని నిర్వహించటంలో విద్యార్థులు అధ్యాపకులకు సహాయపడుతుంటారు. ధాన్యం, గడ్డి, అనేక రకాల కూరగాయలు వగైరా పంటలు పండించటంలో, దున్నటంలో, మన్ను కుళ్లగించటంలో, నూర్పిడి వగైరా పనులలో, పశువులను, కోళ్లను పెంచటంలో విద్యార్థులు తోడ్పడుతుంటారు.

స్కూలు పొలంలో పండించే పంటలో కొంతభాగం అమ్ముతారు. అధికభాగం విద్యార్థుల భోజనానికి వినియోగిస్తారు. ఈ ఆహార పదార్థాన్ని ప్రాసెస్ చేయటం, గడ్డ కట్టించి నిల్వచేయటం వంటకాలు చేయటం వగైరా పనులలో విద్యార్థినిలు తోడ్పడుతుంటారు.

నిర్మాణాలలో కూడా విద్యార్థులు పని చేస్తుంటారు. ఉదాహరణకు, 1961 లో కొత్త వ్యాయామశాల నిర్మాణంలో విద్యార్థులే సామగ్రి మోశారు. చట్రం నిర్మించారు. కలప కోశారు. గోడలు కట్టటంలో తాపీవాళ్ళకు సహాయపడినారు. విద్యార్థినులు తమ హాస్టలు గదులకు రంగులు వేయటం వంటి సులువైన పనులు చేశారు.

హాస్టలులో ఉండే విద్యార్థుల ఆర్థిక అవసరాలను బట్టి వాళ్లు కొంతడబ్బు సంపాదించుకోటానికి వీలుగా ఒప్పందం మేరకు ఈ పని జరుగుతుంది. విద్యార్థుల సంపాదనపని ప్రమాణం, దాని కష్టాన్నిబట్టిగాక పనిచేసే తీరునుబట్టి ఉంటుంది.

"విద్యార్థులకు చెల్లించవలసిన వేతనాలను లెఖ్ఖ కట్టటంలో తమకు నిర్దేశించిన పనులకు వేళ తప్పకుండా చేయటం, ఇతరులతో చక్కగా కలిసిమెలసి పనిచేయటం, చెప్పేపనులను సణగకుండా శ్రద్ధగా చేయటం, పనిముట్లను, ఇతర సాధన సామగ్రిని జాగ్రత్తగా వాడటాన్ని పరిగణనకు తీసుకొంటారు" అని డాక్టర్ ఏండర్సన్ చెప్పారు.

"పనులు చెప్పటంగానీ, అందుకు వేతనాలు నిర్ణయించటంగానీ పనులలో శిక్షణ గరపటానికంటే చక్కని పని అలవాట్లు నేర్పటానికి ఉద్దేశించబడి ఉంటవి" అన్నారాయన.

విద్యార్థుల సంపాదనలను నిర్ణయించటానికి ఈ స్కూలులో ఒక విధానాన్ని రూపొందించారు. పనిచేసే ధోరణి, అలవాట్లలో విద్యార్థి లోపం కనపరచినట్లయితే అతని వేతనంలో కొద్దిగా కోతపడుతుంది. ఒక వేతనపు కాలంలో ఎట్టిలోపాలు లేకుండా పనిచేసిన విద్యార్థికి బోనసు కూడా లభిస్తుంది.

"విద్యార్థులు తమనుంచి ఆశించిన పని సక్రమంగా చేసినట్లయితే నెలనెలా 10 నుంచి 20 శాతందాకా బోనసు వస్తుంది" అన్నారు డాక్టర్ ఏండర్సన్.

ఈ స్కూలులో విద్యార్థులకు ఒక ప్రత్యేక కార్యక్రమం ఉన్నది. తడవకు ఆరేసి మంది బాలికలకు గృహకృత్యాలలో శిక్షణ నిస్తుంటారు. గృహ ఆర్థిక విషయాల టీచరు పర్యవేక్షణక్రింద ఈ బాలికలు తమ ఆహారం తాము కొనుక్కోవటం, వంటకాలను నిర్ణయించుకోవటం, వగైరా సకల గృహకృత్యాలను నేర్చుకుంటారు.

రేబన్ గ్యాప్—నెకూషీ స్కూలులో జరిగే కార్యకలాపాలు చదువుకూ, పనులకూ సంబంధించి మాత్రమే కాదు. ఆటల కార్యక్రమాలు, స్కూలు విందులు, డిబేటింగు సొసైటీ, గ్లీక్లబ్, నాటకసమాజం కూడా ఉన్నవి. ఇంకా ఈ స్కూలులో, ఊరిలో జరిగే వివిధ చర్చి కార్యకలాపాలలో విద్యార్థులు పాల్గొంటూ ఉంటారు. పలువురు విద్యార్థులు అమెరికా భావికర్షకుల సంఘం, 4-హెచ్ క్లబ్బు, గ్రామీణ యువజనసంఘం, భావిగృహిణుల సంఘం కార్యక్రమాలలో కూడా పాల్గొంటారు.

ఈ స్కూలు 1917 లో కర్షక కుటుంబ కార్యక్రమం ప్రారంభించింది. ఈ కార్యక్రమం క్రింద నూరు కుటుంబాలు కొద్ది పెట్టుబడితోనో లేక అసలు పెట్టుబడి లేకుండానో ఉత్తమ సేద్య పద్ధతులను నేర్చుకోటానికి తద్వారా అవి ఆర్థికంగా స్థిమితపడటానికి అవకాశమేర్పడుతుంది. ప్రస్తుతం పన్నెండు కుటుంబాలు ఈ కార్యక్రమంలో పాల్గొంటున్నవి.

ఆయా కుటుంబాలవారు పండించాలనుకొంటున్న పంటలకు అనుగుణంగా ఈ స్కూలు ఒక్కొక్క కుటుంబానికీ భూమి కేటాయిస్తుంది. కోళ్ళ పెంపకానికంటే పాడి పరిశ్రమకు హెచ్చు భూమి అవసరం. అవసరమైతే ఈ స్కూలు అప్పులిస్తుంది. వ్యవసాయ పనిముట్లు అరువిస్తుంది. పశువుల పెంపకానికి సహాయం చేస్తుంది. సేద్యం కానితరుణంలో వయోజనులు స్కూలులో పనులు చేసి అదనంగా డబ్బు సంపాదిస్తుంటారు.

ఖర్చులు, లాభాలు, స్కూలు - కుటుంబాల మధ్య పంపిణీ అవుతవి.

"ఇందులో మాలక్ష్యం అవకాశం కలిగించటమే కాని దానధర్మాలు చేయటంకాదు" అన్నారు డాక్టర్ ఏండర్సన్.

వ్యవసాయక్షేత్ర మేనేజరు ఆధ్వర్యాన జరిగే ఇష్టాగోష్ఠి తరగతులలో పురుషులు ఎరువులు వేయటం, సేద్యం చేయటం, పశుపోషణ,

మార్కెటింగు, వ్యవసాయానికి సంబంధించిన తదితర విషయాలు నేర్చుకొంటారు. ఒక్కొక్క కుటుంబం పదేళ్ళపాటు ఈ స్కూలులో ఉండ వచ్చును. అయితే కొన్ని కుటుంబాలవారు ముందే స్కూలునుంచి వెళ్ళిపోతుంటారు.

స్త్రీలు కుటుంబ ఆర్థికవిషయాలు, కుట్టుపని, గృహనిర్వహణగురించి నేర్చుకొనటం ద్వారా వ్యవసాయ కుటుంబ కార్యక్రమంలో పాల్గొంటూ ఉంటారు.

ఈలోగా వారి పిల్లలు స్థానిక ఎలిమెంటరీ స్కూలులోగానీ, రేబన్ గ్యాప్ - నెకూషీలో గానీ చదువుకొంటూ ఉంటారు. పిల్లలులేని కుటుంబాలకు ఈ స్కూలులో ప్రవేశం లభించదు.

జార్జియాలోని ప్రెస్బిటేరియన్ చర్చిలు ఈ స్కూలుకు కొంతవరకు సహాయం చేస్తున్నవి. ఒక చిన్న ఎండోమెంటు (ధర్మాదాయం), వ్యక్తులనుంచి విరాళాలు, విద్యార్థులు, వ్యవసాయం ద్వారా వచ్చే ఆదాయం. స్త్రీల చర్చిలు, దేశభక్తిపరులు ఇచ్చే విరాళాలతో ఈ సంస్థ పోషించబడుతున్నది.

లివింగ్ మెమోరియల్ ఫండుకు లభించే విరాళాలు విద్యార్థుల వేతనాలకు తోడ్పడు తున్నవి. చదువుకు రుసుము చెల్లించలేని కారణంతో విద్యార్థులను ఇంతవరకు బయటకు పంపిన సందర్భాలు లేవు.



# మంజుల

'మంజులా!'

పుస్తకం చదువుకుంటున్న మంజుల తలెత్తి అన్న రాము వైపు చూసింది.

'మా ఫ్రెండు బెంగుళూరు నుంచి వస్తున్నాడు. సాయంత్రం ఇంట్లోనే ఉంటావుకదూ!' అన్నాడు అన్న. మాటల్లోని అంతర్యాన్ని మంజుల త్వరగానే అర్థం చేసుకుంది.

"నాకోసం నువ్వు అనవసరంగా శ్రమపడుతున్నావన్నయ్యా! నాకీ జీవితమే ఎంతోహాయిగా ఉంది." అని నవ్వింది. కాని ఆమె నవ్వులో జీవం లేదు.

'ఎప్పుడో జరిగిపోయిన సంగతులను మనస్సులో పెట్టుకొని జీవితాన్ని వ్యథాపూరితం చేసుకోవడం తెలివైన పనికాదమ్మా! వివాహమే జీవితానికి పరిపూర్ణతనిస్తుంది. ఈ రోజునవచ్చే వరుడు అన్నివిధాలా ఉన్నతుడు. నీకునచ్చుతాడనే నా ఉద్దేశం.' రాము మాటలు మంజుల హృదయాన్ని కలచివేశాయి.

'ఏ పెళ్లికొడుకైనా తనదృష్టిలో శేఖర్ స్థానాన్ని పొందగలడా?' అనుకున్నది. గతస్మృతులు అలలు అలలుగా ఆమె మదిలోనికి రాసాగాయి.

ఆరోజు తనూ, రాము ఓడియన్‌లో 'వార్ అండ్ పీస్' చూడటానికి వెళ్లారు. సినిమాపూర్తియే సరికి వర్షం జోరుగా కురుస్తూంది.

'మీకభ్యంతరం లేకపోతే నాకారులో డ్రాప్ చేస్తాను.' స్వచ్ఛమైన తెలుగుమాటలువిని మంజుల తలెత్తి చూసింది. ఫుల్ సూటులో భారీగా హుందాగా ఉన్నాడా యువకుడు. రాము నిముషంలో స్నేహం కలిపి సరే నన్నాడు. ముక్కూ ముఖం తెలియని వ్యక్తి కారులో వెళ్లడం మంజులకిష్టం లేకపోయింది. తప్పని సరిగా అన్న వెంట కారెక్కింది.

' ఆ సంఘటనే శేఖర్‌తో పరిచయానికి దారి తీసింది. శేఖర్ తమయింటికి తరుచు వచ్చేవాడు. రాము, శేఖర్ ప్రాణ స్నేహితులైపోయారు. అమెరికాలో డాక్టరేట్ పొంది వచ్చిన శేఖర్ యెన్నో సంగతులు మాట్లాడేవాడు. అతడి మాటల్లో అమాయకత్వం తొణికిసలాడేది. మంజుల అతన్ని లక్ష్యపెట్టేదికాదు. తమకోసం అతడు ప్రాకులాడటం చూస్తే ఆమెకు చికాకువేసేది. అతడి పదిమాటలకు ఒక్కసారి సమాధానం చెప్పేది.

'పాశ్చాత్యదేశాల నంత పొగుడుతారే. మరి వారితోనే బాంధవ్యాన్నేర్పరచు కోలేదేమండీ?' కొంటెగా ప్రశ్నించిందొకరోజు.

'అక్కడ నేను ఉన్నన్నాళ్లూ వివాహం గురించి ఆలోచించలేదు. వారి ఆచారవ్యవహారాలు, మనస్తత్వాలు మనకు భిన్నంగా ఉంటాయి. మావాళ్లకు అటువంటి సంబంధాలిష్టంలేదు' అన్నాడు.

'అయితే ఆ విధమైన వివాహాలు చేసుకున్న వారు సమస్యలతో సతమతమౌతున్నారనే మీ అభిప్రాయమా? అభ్యుదయాన్ని కాంక్షించని బంధువర్గమంటే మీకెందుకంత అభిమానం? అమెరికా వెళ్ళి వచ్చినా వేదకాలంనాటివారే మీరు' మంజుల విశాల నేత్రాలు హేళనగా నవ్వేయి.

'పాశ్చాత్యులతో వైవాహిక సంబంధమే అభ్యుదయమనుకుంటే పొరబడుతున్నారు మంజులా! వివాహమనేది వ్యక్తిగత విషయం. అభ్యుదయమని, పేరు కోసమని దూరాలోచన చేయకుండా చేసుకున్న వివాహం సఫలమౌతుందనుకోను. నాక్కాబోయే భార్య అన్నివిధాలా హైందవ సాంప్రదాయాలకు ప్రతినిధిగా ఉండాలని నా అభిమతం. సంసారాన్ని నౌఖర్లకు వదలి, పార్టీలకు, సమాజాలకు సంఘసేవ పేరుతో వెళ్తూ నేలవిడిచి సాముచేసే స్త్రీలను నేను గౌరవించలేను. విద్యావతి అయిన స్త్రీ లోతుగా ఆలోచిస్తే వివాహం, సంసారం జీవితంలో వహించే ప్రముఖపాత్ర నర్థం చేసుకోగలదు. అటువంటి యువతిని నేను ఎన్నుకొన్ననాడు మావాళ్ళు

తప్పకుండా అంగీకరిస్తారు? శేఖర్ తనమనస్సును విప్పి చెప్పాడు.

'అయితే ప్రస్తుతం అన్వేషణలో ఉన్నారన్నమాట', అన్నది నవ్వుతూ.

'అన్వేషణ ఫలించింది. కాని వధువు అంగీకారమే యింకా పొందలేదు' అన్నాడు.

'ఎవరో తెలుసుకోవచ్చా?'

'నా ఫ్రెండు రాము చెల్లెలు మంజుల. శేఖర్ ఆమె వైపు ప్రేమపూర్వకంగా చూశాడు. మంజుల త్రుళ్లి పడింది.

'శేఖర్! ఏమిటీ అతిచనువు?' తీవ్రంగా అడిగింది.

'ప్రేమించడం నేరమంటారా?'

'హుఁ ప్రేమ! ఆడది కాస్త స్నేహభావంతో మసిలితే ప్రేమించానంటూ వెకిలిచేష్టలు చేయడం యీ కాలపు యువకులకొక జాడ్యంగా తయారైంది' అంటూ విసురుగా మేడమీదకు వెళ్ళిపోయింది. రాము లోపలనుండి వస్తూ మంజుల విసురుగా మెట్లెక్కడం, శేఖర్ ఖిన్న వదనంతో కూర్చొని ఉండటం చూశాడు. దుడుకు స్వభావం గల మంజుల శేఖర్‌ను యేమైనా అన్నదేమోనని బాధపడ్డాడు. రామునుచూసి శేఖర్ లేచి తలనొప్పిగా ఉందంటూ వెళ్ళిపోయాడు.

ఆనాటినుండి శేఖర్ రాముయింటికి రాలేదు.

★ ★ ★

దాదాపు ప్రతిరోజూ ఏదో వేళకువచ్చి కబుర్లుచెప్పి వెళ్లే శేఖర్ రాకపోవడం అందరితోపాటు మంజులకు కూడ యేదో వెలితిగా కనబడసాగింది. అతని రూపమూ మాటలూ వెన్నాడసాగాయి.

ఒకరోజు మౌంటురోడ్డుకు మంజుల, వదినె శైలు, రాము షాపులోకి వెళ్ళారు.

'మంజులా!' శేఖర్ స్వరం విని తలెత్తింది.

'మీ మనస్సు నొప్పించి ఉంటే క్షమించండి మంజులా! రాము స్నేహితుడిగానైనా గుర్తుంచుకుంటారు కదూ!' అన్నాడు. అతనిమాటలు శూలాల్లా గ్రుచ్చుకున్నాయి. ఎంతప్రయత్నించినా తలెత్తి జవాబు చెప్పలేకపోయింది. కొంత సేపటికి చూసేసరికి దూరంగా వెళ్తూ కన్పించాడు.

తరువాత మంజుల శేఖర్‌ను చూడలేదు. ఒకరోజు శైలుయేదో మాటల్లో చెప్పింది శేఖర్ బెంగుళూరు వెళ్ళిపోయాడని. మంజుల మనస్సెందుకో బరువెక్కిపోయింది. 'శేఖర్‌ను ప్రేమించానా?' అని మొదటిసారిగా ప్రశ్నించుకుంది.

★ ★ ★

సాయంత్రం ఆరుగంటలకు కాలేజీనుండి మంజుల వచ్చేసరికి రాము హడావిడిగా భోజనంచేస్తున్నాడు.

'ఇంతత్వరగా భోజనంచేస్తున్నావేం అన్నయ్యా' ఫ్లాస్కులోని కాఫీ కప్పులోకి వంచుతూ అడిగింది.

'మీ అన్నయ్య ఫ్రెండు శేఖర్‌కు రేపురాత్రి పెళ్ళి. సెలవులేకపోవడంవలన వెంటనే రమ్మని వైరిచ్చాడు' శైలు మంజులకు జవాబుచెప్పింది.

మంజుల అదిరిపడింది. శేఖర్‌కు వివాహమా? ఆమె హృదయంలో తెలియని ఆవేదనరేగింది. మౌనంగా మేడమీదకు వెళ్ళిపోయింది. రోజూ యెంతో సరదాగా కబుర్లుచెప్పే మంజుల కంగారుగా వెళ్ళిపోవడంచూచి రాము, శైలు తెల్లబోయారు. రాము బెంగుళూరువెళ్ళి పోయాడు.

హాల్లో కూర్చొని స్వెట్టరు అల్లుకుంటూన్న శైలు ఎనిమిదిగంటలు కొట్టడంతో లేచి మంజులను భోజనానికి పిలవడానికి మేడయెక్కింది. మంజులగదిలోకి వెళ్లి లైటువేసింది. మంజుల దిండునానుకొని గోడవైపు తిరిగి పడుకుంది.

'మంజులా!' పిలుపు విని శైలువైపు తిరిగింది. మంజుల మ్లానవదనం చూచి శైలు అప్యాయంగా 'వంట్లో బాగాలేదా?' అని అడిగింది.

'తలనొప్పిగా ఉంది వదినా' అన్నది మంజుల. గ్లాసుతోపాలుతెచ్చియిచ్చి క్రిందికి వెళ్లిపోయింది శైలు.

బెంగుళూరునుండి తిరిగివచ్చిన రాము శేఖర్ పెళ్ళి విషయాలు అదేపనిగా చెప్పనారంభించాడు. శేఖర్ భార్య యెంతోఅందమైనదని అణకువకలదని, విద్యావతి అని అనేవాడు. ఆ మాటలు మంజుల నెంతో బాధించేవి.

శ్రీమతి వాణి

అహంభావంతో శేఖర్‌ను అపార్థంచేసుకొని తూలవాడి నందుకు కుంగిపోయింది. అందగాడు, విద్యావంతుడు అయిన శేఖర్‌ను మూర్ఖంగా దూరంచేసుకున్న తన అజ్ఞానాన్ని నిందించుకొంది.

ఎప్పుడూ హుషారుగా తిరిగే మంజుల అన్యమనస్కంగా ఉండటం రాము గమనించాడు. ఒకరోజు ఆమె పెండ్లి ప్రస్తావన తెచ్చాడు.

'నువ్వెందుకో నీరసంగా, నిరుత్సాహంగా కనబడుతున్నావు మంజులా! నీ మనస్సులో బాధయేమిటో నాతో చెప్పవూ?' అంటూ రాము లాలనగా అడిగాడు

'అబ్బే! ఏమీలేదు. పరీక్షలు దగ్గరకువస్తున్నాయి కదూ! రాత్రిపూట ఎక్కువ చదవడంవలన అట్లా కనబడుతున్నానేమో!' నవ్వడానికి ప్రయత్నించి విఫలురాలైంది

'పరీక్షలవగానే నీ వివాహం చేద్దామనుకుంటున్నాను. అప్పుడూ నీ విట్లాగే ఉంటే ఒప్పుకోను' నవ్వుతూ అన్నాడు. మంజుల అదిరి పడింది.

'నాకు పెళ్లి వద్దన్నయ్యా! నేను ఎమ్. ఎ. లో జాయిన్ అవుతాను,' అన్నది.

'ఎంత చదివినా వివాహంచేసుకోకతప్పదు మంజులా! ఉత్తముడైన వ్యక్తి నీకు భర్తగా లభించిననాడు నీ ఆశయాలు తప్పకుండా నెరవేరుతాయి. నువ్వు గృహిణివైతే కాని అమ్మా, నాన్నగార్ల ఆత్మలు శాంతించవు' అన్నాడు. మంజుల మౌనంగా రాము ముఖంలోకి చూచి తలవంచుకుంది.

'శేఖర్ స్నేహం లభించినందుకెంతో మురిసిపోయాను. అతడే నీకు తగినవరుడని నేను అనుకున్నాను. కాని నీవెందుకో అతనికి దూరంగా ఉండిపోయావు. మనతో బాంధవ్యంకోసం తహతహలాడిన అతడిని చీదరించుకున్నావు' బాధగా అన్నాడు రాము.

'నన్నిక బాధపెట్టకన్నయ్యా!' అంటూ మంజుల చేతుల్తో ముఖంకప్పుకొని సోఫాలో వాలిపోయింది. రాము నిర్ఘాంతపోయాడు. మంజుల శేఖర్‌ను ప్రేమించిందా! అని మనస్సులో తర్కించుకుంటూ వెళ్లిపోయాడు.

మంజుల మనస్సు అల్లకల్లోలమైంది. శేఖర్‌వంటి ఉత్తముడిని దూరంచేసుకున్నందుకు పశ్చాత్తాపంతో క్రుంగిపోయింది.

ఎట్లాగో బి. ఏ పరీక్షలు పూర్తిచేసింది.

★ ★ ★

మంజుల మేడమీదకు వెళ్లిపోయి గతాన్ని తలుచుకొని ఆవేదనతో కుమిలిపోసాగింది.

'పెళ్ళివారు వచ్చేవేళ అయింది. త్వరగా తెములు మంజులా!' అంటూ శైలువచ్చి హెచ్చరించింది.

'నాకు పెళ్ళివద్దు వదినా! శేఖర్‌ను, మూర్ఖంగా దూరం చేసుకున్నాను' అంటూ వాపోయింది.

'జరిగిపోయిన విషయాలను మర్చిపోవాలి, నీకిష్టం లేని పెళ్ళి మేము చేస్తామా? కాని మనస్సు దిటవు పర్చుకో. ఈరోజున వచ్చేవరుడు అన్ని విధాలా అనుకూలుడు. నామాటవిని సంతోషంగా ఉండు మంజులా!' అంటూ శైలు అనునయించింది. అన్నావదినెలమాట తీసివేయలేక మంజుల అయిష్టంగా ముస్తాబైంది.

'వారంతావచ్చేశారు. త్వరగారా మంజులా!' అంటూ శైలు గబగబా వచ్చింది.

'నేను రాలేను వదినా!' అంటూ మంజుల కళ్ళనీళ్లు నింపుకొని కూర్చుండిపోయింది. శైలు క్షణమాగి క్రిందకు వెళ్ళిపోయింది.

అడుగుల చప్పుడు విని మంజుల తలెత్తి చూచింది. ఆశ్చర్యంతో ఊగిపోయింది.

'నీకోసం వచ్చినపెళ్లికొడుకును నేనే అయితే యిష్టమేనా మంజులా?' లోపలకు వస్తూ శేఖర్ అడిగాడు.

మంజులకళ్ళు సిగ్గుబరువుతో వాలిపోయాయి. ఆమె హృదయం పురివిప్పిన నెమిలై నాట్యమాడసాగింది.

'నాటకమాడి నన్నెందుకింత బాధపెట్టారు?' అని అడిగింది. శేఖర్ లాలనగా ఆమె తల నిమిరాడు.

'ఈ నాటకం నీకు బాధకలిగించినందువలననే నేను అదృష్టవంతుడినయాను,' అన్నాడు.

'మిమ్మల్ని యెన్నోవిధాల మాటలాడినా నన్ను మన్నించారు. మీది అమృతహృదయం' మంజుల ముఖం చిరునవ్వుతో వెలిగిపోయింది. ముగ్ధుడైన శేఖర్ నిండు మనస్సుతో మంజులను హృదయానికి హత్తుకున్నాడు.



# మాస్కోలో

# ప్రపంచ మహిళా

# మహాసభ

మాస్కోలో జరుగుతున్న ప్రపంచ మహిళా సభ గురించి భారతదేశం ప్రచారం చేస్తున్నది, సమావేశాలు జరుపుతున్నది, యీ మహాసభకు సంబంధించిన అంతర్జాతీయ మహిళా ప్రజాస్వామిక సమాఖ్య 2000 బాడ్జీలను అమ్మింది. దేశవ్యాప్తంగా ప్రచారం సాగి పోతున్నది. ఢిల్లీలో, ప్రాథమిక సమావేశాలే కాకుండా, ఒక వారం అల్లా మహాసభ ప్రత్యేక సన్నాహవారం అన్న పేరుతో కృషి జరిగింది. శ్రీమతి రామేశ్వరీ నెహ్రూ, శ్రీమతి అరుణ అసఫాలీ రాజధానిలో జరిగిన సమావేశాల్లో పాల్గొన్న ప్రముఖురాండ్రలో వున్నారు.

శ్రీమతి రామేశ్వరీ నెహ్రూ మహాసభలో పాల్గొనమని కోరుతూ భారతీయ మహిళలకు విజ్ఞప్తి చేశారు. భారతీయ మహిళల పోరాటాన్ని ప్రస్తావిస్తూ ఆమె యిలా చెప్పారు: "ఇటీవల తాము సాధించిన ప్రగతినంతటినీ కాపాడుకోవడానికీ; యింతేగాకుండా హుందాతనంలో, సిరిసంపదలతో, సుఖంతో తమకూ, తమ కుటుంబాలకూ జీవితాన్ని సాధించుకోవడానికీ ప్రపంచంలో శాంతి అవసరమన్న సత్యం మహిళలకు బాగా తెలుసు."

ప్రపంచ మహిళా సభ యావత్తూ, ప్రపంచ మహిళలకు కలిసికట్టుగా వుండడానికీ ప్రస్తుతం తమ్ము ఎదుర్కొంటూన్న అతి ముఖ్య సమస్యలను చర్చించడానికీ అవకాశం యిస్తుందని నొక్కి చెప్పాక, శ్రీమతి రామేశ్వరీ నెహ్రూ మహాసభ సమగ్రమైన ప్రాతినిధ్యంతో వుండబోతున్నందుకూ, మన ఆఫ్రికన్, ఆసియన్ సోదరీమణులు దానిలో ఎక్కువగా వుండబోతున్నందుకూ సంతోషాన్ని వ్యక్తం చేశారు. తమ స్వాతంత్ర్యంకోరకు యింకా పోరాడుతోన్న దేశాలనుండి రాబోతున్న మహిళలపట్ల ఆమె సానుభూతినీ, సంఘభావాన్నీ తెలిపారు. "సకల దేశాలూ స్వాతంత్ర్యం పొందకుండా మహిళలకు అభివృద్ధి లేదని మనకు తెలుసునుగదా" అని ఆమె ఉద్ఘాటించారు.

"వివిధ రాజకీయాభిప్రాయాలూ, విభిన్న అనుభవాలూ, దృక్పథాలూ గలవారు దీనిలో కలుసుకుంటారు. మహాసభలో చర్చింపబడే సమస్యలు; జాతి, మతం ఏదేనా, రంగు, రాజకీయాభిప్రాయాలు ఏవైనా ప్రతి మహిళకూ ఒకేవిధంగా నిజమైనవి, ముఖ్యమైనవి."

★ ★ ★

అంతర్జాతీయ ప్రజాస్వామిక మహిళా సమాఖ్య ఏర్పాటుచేసిన ప్రపంచ మహిళా సభ మాస్కోలో జూన్ 24 న ప్రారంభమైంది.

దీనికి 120 దేశాలనుండి వివిధ మహిళా సంస్థలకు చెందిన ప్రతినిధులు వచ్చారు. భారత దేశం నుండి 34 మంది మహిళలు వచ్చారు.

వారిలో 20 మంది భారతమహిళా సమాఖ్యకు చెందినవారు. జపానీస్ ప్రతినిధివర్గంలో 20 మహిళా సంఘాలకు చెందిన 50 మంది ప్రతినిధు లున్నారు. ఈ సంఘాలలో ఒక్కటి మాత్రమే ప్రపంచ మహిళా సమాఖ్యకు అనుబంధ సంఘం.

పశ్చిమ జర్మనీ నుండి 87గురు ప్రతినిధులూ, పశ్చిమ బెర్లిన్ నుండి వేరే ఒక ప్రతినిధివర్గమూ వచ్చింది. ఇలాగే యితర దేశాలనుండి కూడా ప్రతినిధి వర్గాలొచ్చాయి. శాంతి, జాతీయ స్వాతంత్ర్యం, మహిళల సమానత్వం, ఆరోగ్యం, బాలల విద్య - యీ విషయాలను మహాసభ చర్చిస్తూంది.

మాస్కోకు వచ్చిన మహిళా ప్రతినిధు లందరికీ ఆతిథ్య సంఘాలు స్వాగతమిచ్చి వారికి కావలసిన సౌకర్యాలు ఏర్పాటు చేస్తున్నాయి.

మహాసభ ప్రారంభానికి ముందురోజున ఒక లక్షమంది మాస్కోవాసులు ఉత్సవం జరిపారు. అతిథులకు పూలగుత్తులతో సుస్వాగత మిచ్చారు. ఉత్సవంలో పాల్గొన్నవారు శాంతి మైత్రి సౌఖ్యాలకు చిహ్నాలుగా వేలకొద్దీ గులాబీ మొక్కలు నాటారు.

---

# శ్రీమతి రోడా మిస్త్రీ

"సంఘ సేవారంగంలో తమ కృషి చూసు కొని అమెరికన్ మహిళలు గర్వపడతగినంత ఎంతో ఉన్నది" అని ఆంధ్ర శాసనసభ సభ్యు రాలు శ్రీమతి రోడా మిస్త్రీ అన్నారు శాన్ ఫ్రాన్సిస్కోలో.

భారత సంఘ సేవా మహాసభ ఆంధ్ర శాఖ ఉపాధ్యక్షురాలు కూడా అగు శ్రీమతి మిస్త్రీ రెండు నెలల అమెరికా పర్యటన ముగియ వస్తున్నది. అమెరికా విదేశాంగ శాఖవారి సాంస్కృతిక వినిమయ కార్యక్రమం క్రింద ఈమె పర్యటన చేస్తున్నది.

"సంఘసేవాసక్తిలో అమెరికన్ మహిళలు వారికి వారే సాటి, వారికిది తరతరాలనుంచి వస్తున్న అనుభవం. వారికిది సహజ అభిరుచి లాగా కనపడుతుంది. మా దేశ మహిళలు కూడా ఇదేవిధంగా ఆసక్తి కల్గించుకొంటే ఎంతో బాగుండును. ఇండియాలో సంఘసేవ అనేది కొత్త వ్యాపకము, అమెరికాలో సంఘ సేవికులపట్ల హెచ్చు గౌరవం చూపుతారు. వచ్చే 10, 15 ఏళ్ళలో మా దేశంలో కూడా సంఘ సేవికులకు ఇంత ప్రతిపత్తి లభిస్తుంది.

"మీ పద్ధతులన్నీ కూడా అద్భుతంగా ఉన్నవి. చూస్తుంటే అసూయ కల్గుతున్నదను కోండి. అమెరికన్ సంఘ సేవికులకు అసా ధారణమైన అర్హతలున్నవి" అని అంటూ, అయితే ఈ అమెరికన్ పద్ధతులు ఇండియాలో సాధ్యంకావనీ, ఇవి చాలా డబ్బు ఖర్చుతో కూడినవి కావటం ఇందుకు కారణమని అన్న దామె.

తాను ఇండియాలో నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాలకు తనకు ఉపయోగపడగల మూడు అనుభవాలను ఆమె ప్రత్యేకించి చెప్పింది. 70 కాఫీ హోటళ్ళు నడుపుతున్న కాలిఫోర్నియా రెస్టారెంట్ సంస్థ, అవిటివారికి పనులుచూపే గుడ్విల్ పరిశ్రమ (ఇక్కడ వ్యాపార పాత సరుకులను బాగుచేసి మళ్లా అమ్ముతారు), ఉత్తర కెరొలైనాలోని కృత్రిమ రబ్బరు ఫ్యాక్టరీలలో తాను చూచినవే ఈ మూడు అనుభవాలు. ఇండియా ఆస్పత్రుల లోను, పరిశ్రమలలోను స్త్రీలకు పని కల్గించే ఉద్దేశ్యంతో 18 తేనీటి దుకాణాలు నడుపుతున్న తమ సంస్థకు ఈ అనుభవాలు ఉపయోగమైన వని శ్రీమతి మిస్త్రీ అన్నది.

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు.

నెచ్చెలీ :

మీ పిల్లలకు పాఠ్య పుస్తకములు దొరకక నానా అవస్థ పడుచుంటిమని వ్రాసితివి. అయితే దొరకుచున్న దెవరికి? ఈవిషయమున అందఱి అవస్థ ఒకటిగనే ఉన్నది. మా పౌత్రునిచే ఈ వేసవి సెలవులలో రెండవ వాచక పుస్తకమును చదివించి పూర్తి చేయించి మూడవ తరగతిలో ప్రవేశపెట్టవలెనని వాళ్ళమ్మ తపస్సు చేయుచున్నది. గాని రెండు మ్యునిసిపాలిటీలలో నాలుగు పంచాయితీ సమితులలో ప్రయత్నించినను, ఆ రెండవ తరగతి పుస్తక మెక్కడైనను లభించలేదు. ఆరేడు వత్సరాలు నిండని కుఱ్ఱకుంకలు తమ పాఠ్య పుస్తకములనే మాత్రము జాగ్రత్తగా ఉంచుకొందురు. కావున చిరిగిన పాత పుస్తకమైనను ఏ పిల్లవాని వద్దను ఏ పిల్లవద్దను లభ్యంకాలేదు. కనుక ఆ పిల్లవాడు ఈ సంవత్సర మంతయును ఆ రెండవ తరగతిలో పడి ఉండవలసినదే. ఈ కష్టంమున కొక్కరికేనా? కాదు కాదు ఈ తెనుగు సీమలో ఎంతమంది బాల బాలికలు పాఠ్య పుస్తకములు దొరకక ఏటికేడాది ఆ వెనుక తరగతిలో పడి అల్లాడుతున్నారో చెప్పలేము : పాఠ్యపుస్తకాలపై ప్రభుత్వము వహించిన ఆధిపత్యము జూడ అమ్మతా బెట్టదు, అడుక్కోని తిన నీయదన్న చందముగా నున్నది. ఈ పాఠ్య పుస్తకములను జాతీయము చేయుట వలన పాఠ్యపుస్తకములు ఇతర ప్రచురణ కర్తలచేతులలో ఉన్న నాటిసౌఖ్యమును సౌకర్యమును ప్రజలకు ప్రభుత్వమునకు గూడ లేకుండపోయినది. ప్రభుత్వమందు వల్ల ఏమి లాభము తీయుచున్నదో తెలియదుగాని పసి పిల్లలు చదువు ఒకటవ తరగతి "అల తల" నేర్చు చిన్న బాలశిశువులు గూడ గగన కుసుమమైనవి. ఇక ఆ బిడ్డలు చదువెట్లో పెద్దలు చదివించుటెట్లో అర్థమగుటలేదు. పూర్వ పాఠ్యపుస్తకము కావలసిన ఆ పుస్తకము, ఏ పుస్తకముల దుకాణములలో బట్టిన ఆ దుకాణములలో ధారాళముగా దొరకుచుండెడివి. అట్టి ఈ పుస్తకములను జాతీయము చేసి ప్రభుత్వము ప్రజలను చాల అవస్థలలో పెట్టినది. పిల్లలను అన్యాయము చేసినది. మా టీచరమ్మగారు ఒకటవ తరగతి పుస్తకము కొని తెచ్చుకొను మన్నారనియు, రెండవ తరగతి పుస్తకము కొని తెచ్చుకొను మన్నారనియు. ఇంటింట పిల్లల గొడవ ఆ పుస్తకము కొని తెచ్చిపెట్టలేక తలిదండ్రుల ఘోష, ఎక్కడ చూచిన ఇదియే బాధైపోయినది. పసి బిడ్డల చదువులకే యిన్ని అగచాట్లయిన ఇక పెద్దవారి పాఠ్య గ్రంథముల మాట చెప్పనే అక్కరలేదు. గత సంవత్సర మా కండెన్సుడ్ కోర్సు విద్యార్థినులకు పాఠ్యపుస్తకములు తెప్పించునప్పటికి తలప్రాణము తోకకు వచ్చింది. తరగతుల ప్రారంభించిన మూడు నెలలకు గాని ఎనిమిదవ తరగతి పుస్తకములు చేతి కందలేదు. ఆపై నెలకుగాని లెక్కల పుస్తకాలు రాలేదు. ఆ తరువాత కొన్నాళ్లకు సైన్సు పుస్తకములు ఇరువదైదు మందికి పదునెన్మిది మందికే లభ్యమైనవి. సోషలు స్టడీసు పుస్తకములు ఎవరికినిలేవు. ఎక్కడిదో ఒక పాత పుస్తకమును తెచ్చి టీచరమ్మలు వానిపై నోట్సులు చెప్పగా వానిని వ్రాసికొని చదివి కాలక్షేపము చేసినారు. ఎంత నోట్సుల యుగము గైడుల యుగము అయినప్పటికి అసలు అచ్చు పుస్తకము చదివిన ప్రయోజన మెట్లు లభించును? ఈ ఎనిమిదవ తరగతి మాటయేగాదు. ఇటులనే ఎన్నియో పబ్లికు పరీక్షల పుస్తకములు అచ్చులో లేనివి ఎచ్చటను దొరకనివి గూడా పాఠ్యపుస్తకములుగా విద్యాశాఖ వారు నిర్ణయించుచుందురు. అవి ధూమ్యాకాశములు గాలించినను దొరకవు. కొన్ని పుస్తకములు కొంత కాలమైన తరువాత దొరుకును, కొన్ని పరీక్షలైన తరువాత వచ్చును. ఏదైనను ప్రజలకు ఇబ్బందిగలుగకుండ అందజేయ గలిగిననే ప్రభుత్వమా బాధ్యతను స్వవశము చేసికొనవలెనుగాని అందజేయ జాలనప్పుడీ అధికారవాంఛ ఎందులకో అర్థమగుటలేదు. పాఠ్య పుస్తకముల ప్రచురణ భారము ప్రభుత్వము వహించినదను వార్తవిని నప్పుడు ఇక మంచి మంచి పాఠ్య పుస్తకములు కొకొల్లలుగ లభించుననియు, అవి చౌకగా గూడ నుండుననియు ఆశించితిమి. కాని ఆ

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

రెండు తలంపులురిత్త అయినవి, పూర్వము 25 నయా పైసలుండు ఒకటి రెండు తరగతుల పుస్తకములు 50 నయాపైసలైనవి. అవి ఆయిన ధారాళముగా దొరకునా అనిన అదియులేదు. అవి మ్యునిసిపాలిటీల పంచాయతీ సమితుల పరమై అటనుండి ఎక్కడెక్కడికోపోయి ఎన్నో చేతులు మారి అర్ధరూపాయి పుస్తకము రూపాయికైనను దొరకని చీకటి బజారులకు పోవుచున్నవి. అటు ప్రజలందరిని అక్షరాస్యులను చేయవలెనను ప్రభుత్వ సంకల్పమేమిటో ఇటు వాచక పుస్తకములైనను అందజేయలేని నిస్సహాయ స్థితి యేమో దురూహ్యము.

కల్పలతా!

స్వతంత్ర ప్రభుత్వమువచ్చిన తరువాత విద్యాశాఖ అయినంత తారుమారు తల్లక్రిందులు మరేశాఖయు కాలేదు. విద్యావిధానములో ఏవేవో మార్పులు తీసుకరావలెనని క్రొత్త క్రొత్త సూచనలు చేయుచుందురు అమలులోనికి తెచ్చుచుందురు. కాని అది యేమి కర్మమో అవి అన్నియు వెనుకటివే బాగనిపించుచుండును. పూర్వము మూడవ తరగతి నుండి ఇంగ్లీషు నేర్పువారు. అదిగాదు షష్టఫారము నుండి ఇంగ్లీషు నేర్పిన చాలునని కొంత కాలము క్రిందట తీర్మానించిరి. అది సరిగలేదట. మరల మూడవ తరగతి నుండియే నేర్పుదురట. ఈ మధ్య జడ్డిగంలో మిడత పోటువలె హిందీ ఒకటి వచ్చినది. ఇది రాష్ట్రభాష అయినదేగాని దీనికి మిత్రులెందరో శత్రువులందరు, కుట్టుకు డ్రాయింగుకైనా 30 మార్కులు రావలెనేమోగాని దీనికి మాత్రము ఎస్. ఎస్. యల్.సి. లో గూడా 15 మార్కులు వచ్చిన చాలును. పాపమట్లున్నది, ఆ రాజ భాష స్థితి.

ఇక చరిత్ర భూగోళములేకమై సాంఘిక శాస్త్రమవతరించినది. సైన్సునైన బట్టిపెట్టుచున్నారు గాని సాంఘిక శాస్త్రము పట్టుబడక విద్యార్థులు పడుచున్న బాధ దైవమున కెఱుక. అవి యైన ప్రతి విద్యార్థికిని దొరకుట దుర్లభమే. గత సంవత్సరము మా కండెన్సుడ్ కోర్సు విద్యార్థినులకు సోషల్ స్టడీ పుస్తకములు దొరకనేలేదు. వీని కొఱకు ప్రయత్నము చేసి చేసి విఫలులై తుదకెవరివో పాత పుస్తక మొకటి చేజిక్కించుకొని దానిని చదివి ఉపాధ్యాయులు నోట్సులు చెప్పగా వానినే చదివి విద్యార్థినులు పరీక్షకు వెళ్ళవలసి వచ్చింది. నోట్సులు, గైడులు, ఎన్ని చదివినను అచ్చుగా యిది నోట్సుల యుగము గైడ్సుల యుగమే అయినప్పటికి అసలైన పాఠ్య పుస్తకమును అచ్చులో చదివినంత సుఖముగా నుండగలదా? పాఠ్య పుస్తకము చదువనివారికి మార్కులు సరిగా రాలేదని నిందించి ప్రయోజనమేమి?

ఈ ఒక్క పరీక్ష పుస్తకాల విషయమేగాదు చాల పబ్లికు పరీక్షలకు పాఠ్య పుస్తక నిర్ణేతలు ఎచ్చటను దొరకనివి, అచ్చులో లేనివి ఇకముందు అచ్చుపడగల అవకాశము గూడలేని పుస్తకములను పాఠ్య పుస్తకములుగా నిర్ణయించుచుందురు. వానికొఱకు భూమ్యాకాశములు గాలించినను దొరకవు. ఒక వేళ ఏ పుస్తకమైనను కర్మముచాలక అచ్చుపడినచో అవి పరీక్షలే నెల దినములు కలవనగనో లేక పరీక్షలైన తరువాత వచ్చుచుండును. అప్పుడు వానిని చూచి రోదించుట తప్ప చదువుట కవకాశమెక్కడ?

ప్రభుత్వమైనను పుస్తకములు గాని మరే ప్రజావసరములు గాని ప్రజలకు సుఖముగా అందజేయగలమను ధైర్యమున్నప్పుడే ఆ బాధ్యతను స్వీకరింవలె గాని చేయజాలనప్పుడు అది ఎప్పటివలె ప్రజల పరముగానే ఉంచుటలో గల దోషమేమో తెలియదు. నిజమునకు ఇంత అసౌకర్యముగా ఇన్ని అవక తవకలతో ప్రభుత్వము చేపట్టి ప్రజలను ఇబ్బందులపాలు చేయుటకంటె వీనిని ప్రజాపరముగానే ఉంచే తాము దీనిపై అజమాయిషీ వహించుటలో గల సుఖము సౌకర్యము ప్రజలకు గాని ప్రభుత్వమునకు గాని ముమ్మాటికి లేదని అనేక అనుభవములు తెలియపఱచుచున్నవి, కాని ఈ విషయమును ప్రభుత్వము పట్టించుకొనుటలేదు. పాఠ్యపుస్తకముల విషయమే చూడుము. ప్రజలనందఱను అక్షరాస్యులను చేయవలెనని ఆతురపడెడి ప్రభుత్వము. పాఠ్య పుస్తకముల ప్రచురణ బాధ్యతను తాను వహించి ప్రజల కొనర్చిన సహాయమును. బిడ్డల కొనర్చిన విద్యాసౌకర్యము ఎట్టిదో తెలియుచునే ఉన్నదిగదా. తాముచేసిన ఏర్పాటులో పొరబాటు కలిగినప్పుడు ఆ తప్పును ఒప్పుకొని ఆ పొరబాటును సవరించుటకును, ఎంత పెద్ద పథకమునైనను రద్దుచేయుటకును మహాత్ముడు సంకోచించువాడు కాదు. కాని ఈనాటి పాలకులు గాంధీజీ శిష్యులైనప్పటికిని, మనది స్వరాజ్య ప్రభుత్వమైనప్పటికిని చేసిన పొరబాటు వల్ల ఎన్ని అనర్థకములు

ప్రత్యేకముగా కనిపించుచున్నప్పటికిని వానిని సవరించుటకు రద్దుచేయుటకు ఒప్పుకొనకున్నారు. వారికి ప్రజాభిప్రాయముకంటె ప్రతిష్ఠ నిలబెట్టుకొనుట ముఖ్యముగా నున్నది. అటువంటి మార్పులు అంగీకరించనివానిలో ఈ పాఠ్యపుస్తకములు, నూతన విద్యా ప్రణాళికలు గూడ ఒకటి.

ఈ మధ్య మా బడిలో చదివి వెళ్ళిన ఒక అమ్మాయిని గురించి మీ అమ్మాయి ఏమి చేయుచున్నదమ్మా అని వాళ్ళ అవ్వను అడుగగా అంట్లు తోమించే బడిలో చదువుకుంటున్నదమ్మా.ఆడ చీటిచ్చారన్నది. అంట్లుతోమించే బడేమిటని నేనంటే, అమ్మగారు తమకు తెలవందేముంది. ఆ బడిలో వాకిలి వూడిపిస్తారంట, వంట సేయిత్తారంట అంట్లుతోవిస్తారంట. దానిలో గూడ ప్యాసు కావాలంట. ఇల్లు వూడ్చటానికి గూడ మార్కు లేనటండి! దానిలో గూడా పాసుకావలెనంట. కుడియెడమ ఏమీ లేదంట. అందఱు దేవుకొని తినడమేనంట అన్నది. ఓహో బేసిక్ ట్రెనింగు స్కూలు కాబోలనుకున్నాను. పనులు సేపించని బడి గూడా ఉన్నిదంట, దానిలో మా పిల్లదానికి చీటురాలేధు, ఏదోలే అమ్మా ఎట్టాగో ఈ పదిసెల్లు కట్టబడు, ఎక్కడైనా అచ్చరం ముక్క సెప్పుకొని పొట్టపోసుకుని బతకుదుగాని అన్నాను మా పిల్లతో అన్నది.

ఈ బేసిక్ విద్యా విధానము మన మహాత్ముడు ప్రవేశపెట్టాడు. కాని దాని మంచి సెబ్బరలు చూడకుండనే ఆయన స్వర్గస్తుడైనాడు. పచ్చికాయవంటి ఆ అపరిణిత విధానమునే పక్వఫలముగా నెంచి మన ప్రభుత్వమువారు బాలబాలికలకు అరగింపు చేయుచున్నారు. అది జీర్ణమయ్యీ కాకను మన విద్యార్థులు బాధపడుచున్నారు. అందని పుస్తకములు, అంతు బట్టని విద్యా ప్రణాళికలు ఏమి చెప్పను. నేటి విద్యా పరిస్థితి! దీనికితోడు అవిధేయులైన విద్యార్థులు, విద్యార్థులను పీడించి పీల్చుకొని తిను స్వార్థపరులైన ఉపాధ్యాయులు గూడ ఏర్పడినారు. ఈ గురుశిష్య సంబంధమొక కలిమిత్యాయము.

మిత్రురాలు
శారద

---

# చిన్ని మబ్బులు

## శ్రీ విశ్వనాధ సత్యనారాయణ

కన్నె కాటిక కళ్ళు
చిన్న నాధుని చూచి,
కదలులాడిన వేళ
కందళించిన వేళ
ఆకాశమధ్యాన అట నొక్క తెలిమబ్బు
మెరుపులా మెరిసిందిలే!
వెలుగులో వొరిసిందిలే!
తొలి చిన్ని చూలాలు
కొల సిగ్గు ప్రేమతో.
విభుని చూచిన వేళ
విన్న బోయిన వేళ

బఱపు మిన్నులలోన ఒక నీలితెర మబ్బు
సంజలో తారిందిలే!
జాలుగా మారిందిలే!
తొలి కాన్పు పసిపాప
సాకనేరని బాల,
తెలవోయి పతిజూచి
కళవళించిన వేళ
తూరుపుకోనలో తొంగిలించిన మబ్బు
తెగ పరుగు లెత్తిందిలే!
సొగసులు వోయిందిలే

("వైతాళికులు" నుంచి)

**మీరు చేసే పని ఏదైనా...**

# దానిని మీరు
# భారత దేశాభివృద్ధికి
# చేస్తూన్నారన్నమాట

మీరు, మీ జీవితం, మీరు చేసే పని - భారతదేశం పటిష్ఠం కావడానికి, సమర్థతను పెంపొందించుకోవడానికి చేస్తూన్న కృషిలో ఒక భాగమే. మీరు చేసే పని ఏదైనా సమర్థతతో చేయండి; పని నిలిచిపోవడం, మందగించడం మచ్చుకైనా కనపడకూడదు. కృతనిశ్చయులైన మీవంటి లక్షలాది వ్యక్తుల కృషి ఫలితముగానె విజయం సాధించబడుతుం



మన దేశాభివృద్ధికీ, దేశరక్షణకీ

**కృతనిశ్చయముతో పనిచేయండి.**

DA 63/82



# మాతృదేవోభవ

వంతెన నానుకొని నిలుచున్న సారధి ఒక్కసారి చుట్టూచూసేడు. ఆరోజు కృష్ణపక్షమి నాటి విదియ కావడాన ఆకాశం అంధకారావృతమై భయంకరంగా ఉంది. చీకటిలో స్నానం చేస్తూన్న చెట్ల గుంపులన్ని చిత్రకారుడు విదిలించిన నల్లరంగు మచ్చల్లా ఉన్నై. వంతెన దిగువుగా గల గల మంటూ పారే నది. అది తప్పితే ఎటుచూసినా గుండెలు పిండిచేసే దారుణమైన నిశ్శబ్దం!

నిరాశకూ నిస్పృహకూ నిలయమైన తన హృదయము, అంధకారానికీ. భయంకరత్వానికీ ఆలవాలమైన వాతావరణమూ ఓకేలాగున్నయ్ అనుకున్నాడు సారధి.

తను చీకట్లో పుట్టేడు. ఇంతవరకూ చీకట్లోనే పెరిగేడు. ఇక ముందంటూ ఉంటే అప్పుడూ తనకు. చీకటే శరణ్యం! అయినా తను చీకటితో రాజీపడలేక పోతున్నాడు. తన మనసుకిమల్లె చీకటి కూడా తనను పరిహాస్తోంది. అయినా అంధకారాని కంత నిర్దయ ఏమిటి? తనను విడిచి మరెక్కడకేనా పోరాదూ? 'జీవితానికంతకూ ఆనందదాయకమైనది బాల్యం' అంటారందరూ. ఆ సత్యం ఎందుకో తన పాలిట అసత్య వాక్యమైపోయింది.

అప్పుడు... వీధిబళ్లో తను ఒకటోక్లాసు చదువుకునేవాడు. తనతోపాటు ఎందరో పిల్లలు చదువుకునేవారు. కాని వారికీ తనకూ ఎంత భేదం? వాళ్లెప్పుడూ రంగు రంగుల దుస్తుల్లో అందమైన బొమ్మలపుస్తకాలతో ఆనందంగా వచ్చేవారు; తను మాత్రం మాసికలువేసిన లాగు, మాసిపోయిన చొక్కా... నలిగి నలిగి చిరగడానికి సిద్ధంగా ఉండే పుస్తకాలూ వీటితో తయారవలసి వచ్చేది. తనేనాడూ కొత్తబట్టలకూ కొత్త పుస్తకాలకూ నోచుకోలేదు. సాయంత్రం బడి వదిలేసరికి మిగిలిన వాళ్లందరూ ఆటస్థలంలోకి పరుగులు తీస్తూంటే తను కాళ్లీడ్చుకుంటూ మునసబుగారింటి వంక బయలుదేరేవాడు. వారింటివద్దనే తన తల్లి పనిచేసేది.

సూర్యుడు అర్ధగజంమేర ఆకాశంలోకెగబాకే సరికి తనకి చల్దిగంజిపోసి అమ్మ మునసబుగారింటికి వెళ్లేది. వారింట్లో కసవూడ్చడం మొదలు వంటపని వరకూ చేసేది. మధ్యాహ్నం బడివదలగానే తను వారింటికి వెళితే అమ్మ గిన్నెలో దాచిన అన్నం పెట్టి తనను మళ్లీ బడికి పంపేది.

అమ్మ పడుతున్న శ్రమకు తన మనసు ఏదోలా అయ్యేది. తనేదో చెప్పాలని విఫలప్రయత్నాలు చేసేవాడు. ఆమె అడక్కుండానే ఆమె పనులలో తనూ సాయం చేసేవాడు.

మునసబుగారి పిల్లలను చూస్తే తనకు సరదా, ఈర్ష్యా రెండూ కలిగేవి. అందంగా ఆరోగ్యంగా తిరుగుతూంటే తనకు సంతోషంగా ఉండేదొకవంక. మళ్లీ తనకన్న వాళ్లకేమి అర్హతుందా అలా తిరగలగడానికని ఈర్ష్యకూడ కలిగేది. వాళ్లని చూస్తే తనలో ఎన్నో ఆలోచనలూ ప్రశ్నలూ కలిగేవి. ఉండబట్టలేక ఒకరోజు తన తల్లిని అడిగేసేడు. "ఏమమ్మా నాకు మాత్రం మంచి బట్టలూ పుస్తకాలూ లేవేమీ?" అని,

తన ప్రశ్న విని అమ్మ నవ్వింది. నవ్వుతూంటేనే ఆమె కనులలో నీరు తిరిగింది.

అమ్మఎందుకు నవ్విందో తనకర్థంకాలేదు. అసలమ్మ నవ్విందా లేక ఏడ్చిందా అన్న అనుమానం కూడకలిగింది, ఆమె కన్నీటినీ, చిరునవ్వునూ చూస్తూంటే. అయినా ఒకకంట నవ్వుతూ రెండోకంట ఏడవడమేమిటో? కాలచక్రం బద్ధకంగా తిరుగుతూంటే తను వీధి బళ్లోంచి హైస్కూల్‌లోకి వచ్చేడు. హైస్కూల్‌లో జేరేసరికి తను ఏదో అసాధ్య కార్యాన్ని సాధించినట్లయింది, తను ఐదోక్లాసుప్యాసయ్యేడు! హైస్కూల్‌లో చేరేడు! ఇలా గర్వపడసాగేడు సారథి.

కాని అమ్మ మాత్రం చాలా శ్రమపడవలసి వచ్చింది. స్కూల్‌లో చేర్పించాలంటే జీతంకట్టాలి. ఎవరినేనా అడిగి పాతపుస్తకాలు సంపాదించాలి. అట్లాగే మాసినవీ చిరిగినవి బట్టలుకూడ సేకరించాలి. ఆమె ఏకాకి, అనాధ. పగలంతా కష్టిస్తే తనకూ కొడుకుకూ ఒకపూట కడుపులు నిండుతున్నాయ్. కొడుకుని చదివించి పెద్దవాణ్ని చేయాలని ఆమె ఆశ. కాని ఎలా?

ఆమె సిగ్గువిడచి ప్రతివారినీ యాచించింది. ప్రతి వారికీ తన దుస్థితి చెప్పుకుంది. తన కొడుకు భవిష్యత్తంతా వారిదయాధర్మ భిక్షమీదనే ఆధారపడి ఉందని వేడుకుంది. చివరకామె కోరిక నెరవేరింది. పెద్ద మనుషులు విదిల్చిన కానులే రూకలై సారధికి హైస్కూల్ ప్రాప్తికల్గించేయ్.

హైస్కూల్‌లోకి వచ్చేసరికి సారధికంతా కొత్తగా కన్పించసాగింది. పాఠశాల కిల కిలలాడుతూ మసలుతూన్న పిల్లలతో కల కల లాడిపోతూంది. ఎటుచూసినా కేరింతలే! ఎటుచూసినా నవ్వులు విరజిల్లే ముఖాలే!!

వారిని చూసి సారథి కుంగిపోయాడు. వారికొత్త బట్టలతో తన మాసికలు వేసిన బట్టలను సరిపోల్చుకునేసరికి సారధికి తనమీద తనకే అసహ్యం వేసింది.

నలగని మల్లె పువ్వుల్లా వాళ్లుంటే వాడిపోయిన పూరేకులా తనున్నాడు! వాళ్లకీ తనకూ మధ్య ఎంత వ్యత్యాసం!

రోజులు గడిచేసరికి సారధి ఆ వాతావరణానికీ అలవాటు పడసాగేడు. కాని ఒకరోజు మళ్లీ అతని హృదయానికి గాయంతగిలింది!

మధ్యాహ్నం విరామ సమయంలో పిల్లలందరూ స్కూల్ కెదురుగా ఉన్న రంగయ్య తాత పకోడీలకొట్టు వద్దకు పోయి అదికొనుక్కుతెచ్చుకుని గేటుదగ్గరున్న వేపచెట్టు మొదట కూర్చుని తినేవారు. తను సాధారణంగా వారికంట పడకుండా ఏమూలకోపోయి కూర్చునేవాడు. వాళ్ల అమ్మలు వాళ్లకి డబ్బులిస్తారు కనుక వాళ్లు పకోడిలు కొనుక్కుంటారు. తనకి అమ్మఇవ్వదు. కనుక తను పకోడీలు తినలేడు. తనకు వాళ్లమధ్యకు వెళ్లి మాట్లాడేందుకు అర్హతలేదు.

రంగయ్య తాత పకోడీ లెంత చక్కగాచేస్తాడు! అతను పకోడీలు వేయిస్తుంటే మసాలావాసన క్లాసు రూము వరకూ వ్యాపించి పిల్లల నోళ్లూరుతయ్. ఆ వాసన చూసి తనెన్నోసార్లు రంగయ్య తాత పకోడీలు తినాలనుకునేవాడు.

శ్రీమతి రాచర్ల సుభద్ర

ఆరోజు ఎందుకో పకోడీమీద చర్చ వచ్చింది. అందరూ ఏదో చెబుతూంటే రాము "సారధి నడగండిరా పకోడిల సంగతి" అని తననెత్తి పొడిచేడు. అసలు రాము తత్వమే అంత. అమాయికుల నేడిపించడం వాడికో సరదా.

తన వంక చూసితక్కిన పిల్లలందరూ నవ్వేసరికి సారధికి తల తీసినట్లయింది. తనకళ్లలో నీళ్లుతిరుగుతూంటే సారధి త్వరత్వరగా యింటి ముఖంపట్టేడు.

మరునాడు బడికి వెళ్లేముందు "అమ్మా పైసాలియ్యివే, పకోడీలు కొనుక్కుంటా" అని అడిగేడు సారధి. అమ్మ నవ్వింది. తనకెప్పుడు చేతనైన నవ్వే మళ్లీనవ్వింది. సారధి అది గమనించనట్లు "ఏమమ్మా యివ్వవ్?" అంటూ రెట్టించేడు తల్లిని.

"వాళ్లందరూ కలవాళ్ల పిల్లలు కనుక పకోడీలు కొనుక్కుంటారు. నీవు నాలాటి నిర్భాగ్యురాలి కడుపున పుట్టేవ్. ఒకపూటగంజి నీళ్లకూ మరోపూట అన్నపు మెతుకులకూ మాత్రమే నోచుకున్నావ్ నువ్వు. కడుపు నిండుగా అన్నమే పెట్టలేని అమ్మ నీకు మిగిలిన కోరికలెలా తీరుస్తుంది?" అంది అమ్మ తను పకోడీలు కొనుక్కుంటానన్నందుకు గల కారణం వివరించగా.

సారధికి అమ్మ మాటలు అర్ధంకాలేదు.

"ఏమమ్మా, యివ్వవూ?" అన్నాడు మారాముచేస్తూ.

"తప్పుబాబూ. చిన్నపిల్లలు డబ్బులు ముట్టుకోకూడదు...." ఏదో అభ్యంతరం చెప్పబోయింది అమ్మ.

"వాళ్లుకొనుక్కోవడంలేదూ? నాకు తెలుసు. నువ్వు డబ్బులివ్వవ్, నువ్వు మంచిదానివి కావు...." సారధి ఉక్రోషంతో ముఖం కందగడ్డలాగా నోటికి వచ్చినట్లు అనేసేడు. అమ్మ కళ్లల్లో నీరుతిరిగింది. సారధి అలాగే చూస్తూనిల్చున్నాడు. కొడుకు తన చేయి దాటిపోతున్నాడన్పించింది కన్నతల్లికి. సారధి చెంపమీద ఆమెచేయి ముద్ర వేసింది. బిక్కమొగంతో అమ్మ ముఖంలోకి చూసేడు సారధి.

'ఏఅపరాధమూ చేయని నన్నెందుకు శిక్షించావ్?' అని అడుగుతున్నట్లున్నాయ్ అతని చూపులు.

అమ్మముఖంలో ఆగ్రహం అంతర్ధానం కాలేదు, ఏడుస్తూ బయటకు పరుగెత్తేడు సారధి.

'నడిచినడిచి చెరువుగటకుచేరి అక్కడకూర్చున్నాడు సారధి. అతని మనస్సు క్రోధంతోనూ అవమానంతోనూ అటుడికి నటుడికి పోతూంది. అంత లేతహృదయంలో అంతులేని ఆలోచనలు. అమ్మ తనను అన్యాయంగా కొట్టింది. తను పకోడీలు కొనుక్కుంటా ననడం నేరమా? మరి మిగిలిన వాళ్లందరూ కొనుక్కుంటే లేని తప్పు తనుకొనుక్కుంటే ఏముంది? వాళ్లమ్మలు రోజూ వాళ్లకి డబ్బులివ్వడంలేదూ? మరి తనకివ్వదేం అమ్మ? వాళ్లమ్మలు మంచివాళ్లు. తనమ్మ మంచిదికాదు.

ఉ అమ్మ తనకు వద్దు. తను చచ్చిపోవాలి.

ఎదురుగా నిండిన చెరువు సారధిని మభ్యపెడుతూంది. సారధి గట్టు చివరకు వచ్చి నీళ్లల్లోకి చూసేడు. లోతు నీటిలో తనముఖం తనకే కన్పించింది.

'తను చచ్చిపోతే? ఏమవుతుంది? అమ్మ ఒక్కతే ఉంటుంది. అమ్మకాశిక్షపడాలి! అర్ధరాత్రివేళ. గాలికి కిరసనాయిలు దీపం ఆరిపోతే? ఆచీకటిలో అమ్మ ఒక్కర్తీ! ఒద్దు. అమ్మకు భయంవేస్తుందంత చీకటిలో ఎప్పుదేనా దీపమారిపోతే తన గుండెలమీద చేయి వేయించుకునేది అమ్మ. మరి తను చచ్చిపోతే ఆమె ఎవరిచేయి పట్టుకుంటుంది? ఎవరూ లేకపోతే అమ్మకు భయం వెయదూ?'

సారధికి తల్లిమీద వచ్చిన కోపం కరిగిపోయింది. అతని మనోమాలిన్యాన్ని కన్నీటి స్రవంతి కడిగివేసింది. ఇంటివంక పరుగు తీయసాగేడు సారధి.

గుడిసె ముందు కూర్చుని ఏడుస్తూంది తల్లి. తను "పాపిష్టిదాన్ని, పైసాలివ్వలేక పోవడమేకాక పసివాడివనేనా ఆలోచించకుండా చెంప దెబ్బవేసేను." అంటూ తన తలమీద కన్నీరుకారుస్తూ బుజ్జగింపసాగింది. అమ్మ అలా ఏడుస్తూంటే తను చూడలేడు! మెల్లగా ఆమె కనులు తుడిచేడు తన వేళ్లతో.

ఆ రాత్రి తను బుడ్డిదీపం ముందు కూర్చుని చదువుకుంటూంటే "సారధీ, నువ్వు చాల బాగా చదువుకుంటున్నావుటకదూ, నరసింహం మేష్టారు చెప్పేరు. నువ్వు చాల బుద్ధిమంతుడివి బాబూ. బాగాచదువుకుని ఉద్యోగం చేస్తే అప్పుడీ కష్టాలు అవీ ఉండవ్. నాయనా" అంటూ కనులు తుడుచుకుంది తల్లి

సారధి మనసు పట్టరాని ఆనందంతోనూ తృప్తితోనూ నిండిపోయింది. తనేదో గొప్పవాడై పోయినట్లు భావించాడు ఆ భావనలో 'అమ్మా నువ్వు చాలామంచిదానివమ్మా' అని తల్లికి నమస్కారంచేసేడు. తరువాత చాల మార్పులు వచ్చాయ్.

సారధి స్కూల్ ఫైనల్‌లోకి వచ్చేడు. అతనికి పదహారు సంవత్సరాలు నిండేయ్.

తల్లి వయోభారంతోను అనారోగ్యం తోనూ దిగజారి పోతోంది. ఆమెకు కార్యభారం అధికమైంది. సారధి కట్టవలసిన జీతాలూ అవీ బాగా అధికంకావడాన ఆమె ఎక్కువ కష్టపడి ఎక్కువ ఆర్జించాల్సిన అవసరం కలిగింది. ఫలితంగా నీళ్లుమోయడం, వడ్లుదంచడంలాటి భారమైన శ్రమలను కూడ సహించి ఆమె ఆర్జిస్తోంది. పెరుగుతున్న శ్రమ ఆమె ఆరోగ్యాన్ని హరిస్తోంది. గుడిలో మెల్ల అన్నట్లు ఆమె సారధికి నరసింహం మేష్టారింట్లోంచి తెచ్చి ఒకపూట కడుపునిండుకూ భోజనం పెట్టగల్గుతూంది,

తల్లి పడుతూన్న బాధను చూసి సహించలేక "ఎందు కమ్మా అనవసరంగా శ్రమపడతావ్? పెద్దదానివీ, పైగా నీవంట్లోకూడ ఏమంత బాగుండడంలేదు." అనేవాడు దీపపు బుడ్డి క్రీనీడల్లో కన్నీరుకారే కళ్లను దాచుకుని.

"పసివాడివి నీకేంతెలుసు నాయనా నాబాధ? నీకోసం ఎటువంటి శ్రమైనా అనుభవిస్తాను. అనుభవించగలను. నువ్వు శ్రద్ధగా చదువుకుని పరీక్షలు ప్యాసై ప్రయోజకుడివి కావాలి, అదేనా కోరిక. రాత్రుళ్లు నాకు మిగల్చాలని కాబోలు మరీ తక్కువ తింటున్నావ్. కడుపునిండా తిను బాబూ, అసలే చదువువల్ల వేడిచేస్తుంది. దానికి తోడు కడుపునిండా అన్నంతినకపోతే యింకేమైనా ఉందా?"

తల్లిలోని ఆవేదనకూ ఆమె నిశితబుద్ధికీ నివ్వెరపోయాడు సారధి. సంవత్సరం గతించేసరికి తల్లి కన్న కలలలో కొన్ని నిజాలయ్యేయ్. సారధి స్కూల్ ఫైనల్ ప్యాసయేడు. స్కూల్ కంతకూ అతనివే మంచి మార్కులు. పరీక్ష ఫలితాలు తెలిసిన రోజున సారధి ఆనందానికీ తల్లి సంతోషానికీ అవధులులేవు.

'తను మంచి మార్కులతో స్కూల్ ఫైనల్ ప్యాసయేడు. తనకు మంచి బట్టలు లేకపోయినా, మాసిపోయిన పుస్తకాలనే చదివినా తనే అందరిలోకీ మొదటి వాడిగా ప్యాసయ్యేడు. తను కాలేజీలో చేరవచ్చు. హెడ్మాష్టారు స్కాలర్‌షిప్ కోసం వ్రాస్తారు. తను తల్లితో కలిసి విశాఖపట్నం వెళ్లి అక్కడ కాలేజీలో చేరుతాడు!' అంటూ సారధి పేకమేడలు కట్టసాగేడు.

సారధిని చూసి తల్లి ఉప్పొంగి పోయింది. 'తన కలలు నిజమవుతున్నయ్ తన శ్రమకు ఫలితం దక్కుతూంది, కొడుకు ప్రయోజకుడు కాబోతున్నాడు. వాడు తనలా నికృష్టజీవితం గడపనక్కరలేదు. భగవాన్, నీకు ఎప్పుడూ కృతజ్ఞురాలినై ఉంటానయ్యా.' అనుకుంది తల్లి.

కాని వారి ఆశలు అడియాసలే అయ్యేయ్.

హెడ్మాష్టారు సారధి విషయంలో ప్రయత్నించి విఫలమయ్యారు. సారధితల్లి ఎంతప్రయత్నించినా ఒక్కసారి రెండువందల రూపాయలు పోగుచేయ లేక పోయింది.

"ఏం బాబూ, యిక ఏంచేస్తావ్?" అని అడిగిన ప్రశ్నకు సారధి సమాధానమివ్వలేకపోయేడు. ఇంత వరకూ తన భవిష్యత్తుగురించి తన తల్లే నిర్ణయాలు చేస్తూ ఈనాడిలా అడుగుతుందేమీ అనుకున్నాడు. "కాలేజీ చదువు సాధ్యం కాకపోవచ్చును. ఉద్యోగంలో చేరేందుకు ప్రయత్నించు బాబూ" అంది అమ్మ.

"అట్లాగే" అన్నాడు సారధి,

ఉద్యోగప్రయత్నాలు చేస్తూన్న సారధి అంచనాలు దెబ్బలినసాగేయ్. ఎఱుకబడీ, చమత్కారమూ – వీటితో ఉద్యోగాలు సంపాదించాల్సిన రోజుల్లో మార్కులూ నడవడికలకు చాల తక్కువ ప్రాముఖ్యతే యివ్వబడుతూందన్న సత్యం గ్రహించేందుకు సారధికి సంవత్సరం పట్టింది.

ఆ సంవత్సరంలోను సారధి తల్లి సంపాదించిన డబ్బు చాల వరకు అప్లికేషన్ ఫారాలకీ పోస్టాఫీసులకీ తగలేసేడు. తను ఉద్యోగం సంపాదించ లేక పోవడం మాటటుంచి తల్లి కష్టపడి ఆర్జించినది కూడా తగలేసేనే అన్న చింత అధికం కాసాగింది సారధికి.

రాను రాను సారధికి జీవితం మీదా ఉద్యోగం మీదా వైరాగ్యం కలిగింది. ఈ జన్మలో తను సంపాదనాపరుడు కాలేడు. తల్లిని సుఖపెట్టలేడు. బ్రతికినంత కాలం ఆమె రెక్కల కష్టంమీద తను జీవించాల్సిందే!

తల్లికి యింటిపనులలో సాయంచేయబోతే 'ఉద్యోగం చేయాల్సిన మగవాడు వంటింటి పనుల్లోకి వస్తే వృద్ధిలోకి రాలేడు' అని మందలించేది తల్లి సారధిని. సారధి మనసు చివుక్కుమనేది. తను కష్టించి ఆమెను సుఖపెట్టాల్సిందిపోయి ఆమెను కష్టపెట్టి తను సుఖిస్తున్నాడు! తల్లి ఒకవిషయం చెప్పింది. "బాబూ ఎవరేనా పెద్ద మనుషులకి మన దౌర్భాగ్యంగురించి చెప్పుకుంటే ప్రయోజనం కన్పించవచ్చు." సారధి కది నచ్చలేదు, తను బీద

వాడే కావచ్చు. తన తల్లి అనాథ కావచ్చు. కాని ఆవిష యాలు తలచుకుంటేనే మనసు కష్టపడుతూన్నప్పుడు వాటి నితరులకెలాచెప్పడం? బీదవాడిగ జన్మించడకంటె బీదవాడి ననిపించుకుని సానుభూతి పొందడం దుర్భర మైన విషయం. కాని విధి పెట్టిన పరీక్షలో ఓడిపోయి, సారథి ఒక పెద్దమనిషివద్ద తన దుస్థితి అంతా ఏకరువు పెట్టుకుని ఏదేనా ఉద్యోగం యిప్పించమంటే 'నౌకరు చేస్తావా? అదేఖాళీఉంది' అన్నాడాయన అంతా విని. సారథికి అభ్యంతరంలేదు. అతని పరిస్థితటువంటిది. కాని తల్లి మాత్రం వప్పుకోదు. యింతచదువుకుని చివరకు బంట్రోతుపనా! అంటుంది. అది తెలుసు కనుక సారథి ఆ పనిలోచేరలేదు.

తనకంటె తక్కువ మార్కులు వచ్చిన వాళ్లకు స్కాలర్ షిప్పులూ, ఉద్యోగాలూ రావడం చూసి సారథికి లోకమంటే అసహ్యంకలిగింది. ప్రపంచం స్వార్థంతో నిండిపోయింది. వట్టిపాపాల పుట్ట.

చిత్రవధ చేసే మనసుకి తోడుగా లోకుల పరిహా సాలు కూడా సారథికి సమస్యగా మారేయ్. సానుభూతి చూపాల్సిన ప్రజలు శూలాల్లాటి మాటలతో హింసిస్తు న్నారు. ఛీ! ఏంమనుషులు.

కాల చక్రం తిరుగుతూంటే సారథి పూర్తిగా దిగ జారి పోసాగేడు. అతనికి మనుష్యులంటే చిరాకు. ప్రపంచమంటే తగని మంట. తన అధోస్థితికి కారణం యీ మనుషులే అనుకుంటూ సాధారణంగా ఏకాంతంలో కాలం గడుపుతాడు.

ఒకపూట తినీ, మరోపూట తినకా పగలంతా వంతెన దిగువ నీడలోనో, దగ్గరున్న అడవిలోనో కూర్చుని రాత్రి గుడిసెకు వచ్చి నిద్రపోతాడు. అతనికి తల్లిని చూస్తూన్నా విపరీతమైన బాధకలుగుతూంది. ఈ రోజు కూడా అలాగే భోజనంచేసి పడుకున్నాడు. రాత్రి పన్నెం డయినా నిద్రరావడం లేదు. చికాకుగా అటూ యిటూ దొర్లుతున్నాడు.

"ఇంకా నిద్రపోలా?"

"హుఁ. నిద్రకూడాను. ఈ జీవితానికి నిద్ర, సుఖమూ అనేవి ఒక్కసారే. మరణం వస్తే...." సారథి ఏదో అనబోయేడు.

"బాబూ!".... అరిచింది అమ్మ.

చీకట్లో తల్లి వంక చూసేడు సారథి. "నేనుండగా అటువంటి మాటలాడకు నాయనా. మంచీ చెడూ విచక్షణా జ్ఞానం నశించిపోయేంతగా దిగజారిపో తున్నావ్. కాస్త నిగ్రహించుకో బాబూ." అమ్మ ఎక్కి ఎక్కి ఏడుస్తోంది. సారథికి ఆ వాతావరణం దుస్సహంగా ఉంది. మనస్సూ శరీరమూ, ఆలోచనలతో వేడెక్కి పోయాయ్. త్వరగాలేచి గుడిసె బయటకు నడిచేడు.

"సారథీ! బాబూ!" అంటూ అమ్మ రుద్ధకంఠంతో పిలుస్తోంది. సారథి మనసు కరుగలేదు. ప్రస్తుతం ఆ మనసులో కార్పణ్యానికేగాని కరుణకు తావులేదు. సారథి "ఏడుపుమనుషులు! ఆ ఏడుపే అందర్నీ ఏడిపి స్తోంది. ఆ ఏడుపు వినిపించకపోతే తప్ప తనకు శాంతి లేదు" అనుకుంటూ వంతెన వంక నడిచివచ్చేడు.

"సారథీ!" ఝల్లిపడి చూసేడు సారథి. ఎదురుగా నరసింహం మేష్టారు. "ఇక్కడేంచేస్తున్నావ్, యిలాటి సమయంలో?"

సారథి తలదించుకున్నాడు సిగ్గుపడుతూ.

"నీ పరిస్థితంతా నాకు తెలుసు బాబూ." అన్నారు మేష్టారు మెల్లగా. నరసింహం మేష్టారు సారథికి గురువే కాకుండా అన్నదాత కూడాను. ఆయన సారథికి తండ్రిలాటి వాడు.

"తల్లి అన్న పదంలోని మహత్తు నీ కర్థంకాలేదు. విశ్వకర్త సృష్టి కంతకూ అమూల్యమైనదీ అసమాన మైనదీ మాతృత్వం. నవమాసాలూ మోసి జీవన్మరణ స్థితిని దాటి అంతవరకూ అంతరాంతరాలలో పెంచు కుంటూ వచ్చిన శిశువుని ప్రపంచంలో ప్రవేశింపజేసి ఆ శిశువు ప్రయోజకుడయ్యేవరకూ కంటికి రెప్పలా కాపాడుకునే అకుంఠిత దీక్షాపరురాలు, మాతృశ్రీ.

తన సంతానంకోసం తననే బలిచేసుకోగల ఆత్మ త్యాగి. పసివారుగా ఉన్నంత కాలం స్తన్యమిచ్చి మలి నాలను దూరం చేసి పెంచుతుంది తల్లి. పెరిగి పెద్ద వాళ్లవుతూంటే పిల్లల్ని అవసరమైన విధంగా ఆదుకునేది తల్లే.

సారథీ! నీతల్లి యిన్ని కష్టాలకు లోనై నిన్నెందుకు పెంచాలి? నీ మానాన నిన్ను వదిలేస్తే ఏమయ్యేవాడివి? కాస్త ఆలోచించు. కాని కన్నకడుపు అలా చేయదు, చేయలేదు. నువ్వంటే నలుగురిలోకి వెళ్లి బీదవాడినని చెప్పుకున్నందుకు సిగ్గుపడ్డావ్. నీకు ఆత్మాభిమానం అడ్డువచ్చింది.

కాని మీ అమ్మ ఆత్మాభిమానాన్ని చంపుకుంది. ఎవరి కోసం? నీకోసం! సారథీ నీ భవిష్యత్తుకోసం!

ఆమె ఐశ్వర్యవంతురాలు కాకపోవచ్చు. అంత మాత్రంచేత ఆమెలోని పుత్రవాత్సల్య సంపద తక్కువేమీ కాదు. ఆమె కడుపున పుట్టి ఆమెచేతులలో పెరిగిన నీవు మాతృరుణం ఎలాగూ తీర్చుకోలేవు, కనీసం ఆమెకు కృతజ్ఞుడిగానేనా ఉండు. ఆమె అపరాధం చేసినా దానినెత్తి పొడిచేందుకు నీకు అధికారములేదు అర్హతాలేదు.

సారధీ! నీకు మిగిలింది తల్లి మాత్రమే! జీవితంలో ఏం పోగొట్టుకున్నా మళ్ళీ పొందగలవేమో కాని కన్న తల్లిని మాత్రం పొందలేవు.

నిన్న మీ అమ్మ వెళ్ళి హెడ్మాస్టారితో తనస్థితి మొర పెట్టుకోగా ఈ రోజు నీకుద్యోగం రాబోతూందని నాచేత కబురంపేరు. అది చెబుదామనే వస్తూంటే మీ యింటి ముందు కూర్చుని ఏడుస్తూన్న మీ తల్లి నీవిషయం చెప్పింది. నువ్వెక్కడ తొందర పడి ఏంచేస్తావో అని నిన్ను కాపాడమని నన్ను పంపింది!

అర్థమైందా సారధీ. అమ్మంటే ఏమిటో?

వెళ్లు. వెంటనే ఆమె పాదాల మీదపడు! ఆ దేవత కరుణ వలననే నీకు ఉద్యోగం కూడ రాబోతూంది. ఊఁ. వేగం వెళ్లు నరసింహం మేస్టారు ఏడుస్తూ నిలుచున్న సారధిని తొందరచేసేరు.

"అమ్మా!" అంటూ ఊరివంక పరుగుతీసేడు సారధి. అతని హృదయంలో కోటి కంఠాలు గొంతెత్తి పలుకుతున్నయ్.

"మాతృ దేవో భవ" అని అతని హృదయం మార్మోగ సాగింది.



పుణ్యనదులు:

# తపతి

ఉత్తర హిందూదేశమున గంగా యమునల వలె మధ్య భారతవర్షమున నర్మదా తపతులు కేవలనదులు. నిడివి యందును, మాహాత్మ్యము నందును, చరిత్ర యందును గంగా యమునలకు యెంత తారతమ్యము గలదో, నర్మదా తపతి నదులకంత భేదము గన్పడు చున్నది.

నైసర్గికముగ తపతీనది మధ్యప్రదేశ్‌లో బెతుల్ జిల్లాలో వింధ్యపాద పర్వతపంక్తి, అనగా సాత్పూరా పర్వతపంక్తి యందు గోనానగిరి యనబడు తావున జన్మించియున్నది. అచటినుండి పశ్చిమ వాహినియై సాత్పూరా పర్వత కనుములలో బ్రవహింపుచు ఖాండిఘ పీఠభూమినిదాటుచు సూరతు సమభూముల ద్వారా సూరతు పట్టణమునకు కతిపయదూరమున పశ్చిమ సముద్రము నందు కాంబే సముద్రశాఖ యందు సంగమించుచున్నది.

తపతీ నది నిడివి మొత్తము 450 మైళ్లు. ఇది 30,000 చదరపుమైళ్ల నేలను నీటిని సరఫరాజేయుచున్నది. నది చివరి 32 మైళ్లు ఆటు పోటులకు గురియైన ప్రవాహ మగుటచే నందు బరువు తక్కువయైన చిన్న నావలు మాత్రమే ప్రయాణము చేయగల్గుచున్నవి. తపతి నీరు యెచటను పంటలకు వుపయోగపడుటలేదు.

తాపి, తాపసి, మూలతాపీ యని వేర్వేరు గ్రంథము లందు జెప్పబడి తపతీ నదితోబాటు, శబరమతి, కృత వతి, చందనా, గింకర్ణికా, కాశ్యపియను నామములుగల సబర్మతి నదియును, నర్మదయను కాంబేసింధు శాఖలో గలియుచున్నవి మహతి, మహి, మహీసాయనబడు మాహీనదియు నిందేజేరుచున్నది. మూలతాపి యనబడు స్థానమున జన్మించుటచే తపతికి మూలతాపి యను నామ ధేయము గల్గెను. తపతీ జన్మస్థానమును యిప్పటికిని 'మూల్తాయి' యనుచున్నారు. దీని ప్రశంస మత్స్య పురాణము 22వ అధ్యాయములో గలదు.

తపతీ నదిని గూర్చిన ప్రశంస బ్రహద్విప పురాణము నందును, భాగవతమునందును గలదు. పౌరాణికముగ తపతి వివస్వంతుని (సూర్యుని) కుమార్తె; తల్లి సంజ్ఞా దేవి, భర్త సంవరణుడు, తపతి సంవరణుల పుత్రుడు కురుమహారాజు. తపతీ నది యీ తపతి యంశముగా నెన్న బడుచున్నది.

చారిత్రకముగ తపతీ తీరము సుప్రసిద్ధముగదా! ఇచటి సూరత్ పట్టణమున క్రీ.శ. 1612వ సంవత్సర ములో మొట్ట మొదటి ఆంగ్లేయుల ఫాక్టరీ యేర్పడినది. సూరత్ పట్టణము జిల్లా ముఖ్యస్థానమైయున్నది.

తపతీ ముఖద్వారమున స్వాల్లీరేవు భారతదేశ చరిత్రలో ఆంగ్లేయులకు పోర్చుగీసులకు యాధిపత్యము నకై జరిగిన పోరాటములో ముఖ్యస్థాన మాక్రమించి యున్నది. అట్టి సుప్రసిద్ధమైన రేవు యీనాడు దిబ్బయైపూడుపడి యున్నది.

అటు వుత్తరహిందుస్థానమునకు యిటు దక్కనుకు మధ్య సరిహద్దులైన నర్మదా, తపతుల తీరములు లోయలు, గంగా యమునలు ఆర్యసంస్కృతికివలె, నివి దక్కను నాగరికతకు, సంస్కృతికి దోహదమిచ్చినవి నిధానములైనవి. శాశ్వత యశోమాలికల నందుకొన్నవి.

శ్రీమతి వారణాసి యశోదాదేవి

# తల నొప్పిగా ఉందా?

రవ్వంత **అమృతాంజనము** రాయండి

నిమిషంలో
నొప్పి తగ్గుతుంది

జలుబూ, జ్వరాలూ, ఒళ్లు నొప్పులు – వీటన్నిటికీ అమృతాంజనం ఉపయోగించండి. మీ కుటుంబాని కది శ్రీరామరక్ష. నొప్పి కలిగినప్పుడు ఒక్కపిసరు రాస్తేచాలు ఇంట్లో ఒక్క సీసా ఉంటే నెలలతరబడి ఆటిపస్తుంది.




అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు - 4
బొంబాయి - 1, కలకత్తా - 1, న్యూఢిల్లీ - 1.

JWT AM-1424 a

# నిరీక్షణ



సార్ ! సార్ ! పోస్టుమాన్ కేకలకి చదువుతున్న నవలను టేబుల్ మీదకు విసిరి వీధిలోకి పరెత్తింది భాను. చేతిలో కవరుతో నిలబడి నాలుగు వైపులా కలయ చూస్తూ నిల్చున్నాడు పోస్టుమాన్. ఆ కవరును చూడగానే భానుకి ఆతురత ఎక్కువ కాసాగింది. హాల్లోకి వచ్చి బరువుగా ఊపిరి పీల్చుకుంది భాను. అమ్మ కూడా యింట్లోలేదు. ప్రక్కయింటి వర్ధనమ్మగారింటికి వెళ్ళింది. సమయాను కూలంగా లెటరు యిచ్చినందుకు పోస్టుమాన్‌కి మనస్సులోనె ధన్యవాదాలు అర్పించుకున్నది. మనస్సు ఏవో ఊహాలోకాలకి తేలిపోతున్నది. ఎన్నాళ్ళ నుంచో ఎదురు చూస్తున్న శుభవార్త అందినట్లు అనిపించి మనుస్స సంతోషంతో ఉరకలు వేయసాగింది, అమ్మ వస్తుందేమోననే ఆత్రంతో కవరు చింపి అందులోని ఉత్తరం తీసి గబ గబ చదువుకోసాగింది—

భానూ !

నన్ను క్షమిస్తావు కదూ? నా పరిస్థితులన్ని తారుమారై యినాయి. నాన్న ఆస్తిలో కాని యివ్వనన్నాడు మన విషయం తెలిసి. శశిని చేసుకుంటె మామయ్య తన ఆస్తిలో సగం యిస్తానని వాగ్దానం చేసాడు. ఈ సారి నా పరీక్ష పోయింది, యిటువంటి పరిస్థితుల్లో యిక నేను చదవలేను. ఏదయిన ఉద్యోగం చేయటం మంచిదనిపించింది, ఇక్కడే ఒక ఆఫీసులో చేరటానికి ప్రయత్నిస్తున్నాను. అమ్మ మూడు నెల్లనుంచి బాధపడుతూ నెల రోజుల క్రిందటే మరణించింది. అమ్మ ఆఖరి శ్వాస విడిచె ముందు బలవంతంగా నా చేత ప్రమాణం చేయించుకున్నది. 'శశిని నా అర్థాంగిగా చేసుకోమని.' అయిష్టతతో నేను ప్రమాణం చేయవలసి వచ్చింది.

భానూ ! నా పరిస్థితికి జాలివేయటంలేదూ? మనుష్యులు దూరమయినా మనస్సులు దగ్గరవుతాయనే సత్యం తెలుసుకో. నీవు నామీద పెట్టుకున్న ఆశలన్ని అడియాసలు అయినందుకు నేను ఎంతగా కుమిలిపోతున్నానో ! భగవంతుడు మన ఎడల ఎంత నిర్దయచూపాడో భాను ! నీవయినా సుఖపడాలని ఎప్పుడు కోరుతుంటాను.

నీ ప్రసాద్

చెక్కేళ్ళ మీద జారుతున్న కన్నీటిని పమిట కొంగుతో అద్దుకుంటు బరువుగా నిట్టూర్చింది భాను: చావబోయె వ్యక్తులు కూడా స్వర్గాన్నె కోరుకుంటారంటారు యిదె కాబోలు. ఆశ అనేది మానవుడ్ని ఉన్నత స్థితికి తీసుకువెళుతుంది. ఆ ఆశల్లోని బరువు, బాధ్యతలు తెలుసుకోలేని పరిస్థితికి వస్తాడు మానవుడు. ధనం ఆ పేరు వింటునే ఆనంద పడిపోతుంటారు కొందరు. మానవుల్లోని బలహీనత యిదె. ఒకనాడు తను అనుకున్న అమాయక వ్యక్తి ప్రసాద్ మనస్స

యిచ్చిపుచ్చుకున్న వ్యక్తి, నీవు దేవతవు, నీవే నా సర్వస్వం భానూ! అన్న ప్రసాద్ మాటలు తలంపుకు వచ్చి మనస్సు అదోలా అయిపోతున్నది. తను కట్టుకున్న ఆశాసౌధాలన్ని గాలితాకిడికి తట్టుకోలేక కూలిపోయినాయి. భాను హృదయంలో మాయా గాయం రేగింది. మనస్సులో ఏదో తీరని బాధ, అవమానం మనస్సుని వేధిస్తున్నాయి. గతంలో ఒక్కొక్క సంఘటన గుర్తుకు రాసాగాయి.

భానుగారూ! మీ యింగ్లీషు నోట్సు ఒకసారి యిస్తారూ? జాలిగా అమాయకంగా అడిగాడు అతను కాలేజీ నుంచి వస్తున్న తనను ఆపి. తన నోట్సే కావాలా? ఎంత మందిలేరు క్లాసులో తనలాంటి వాళ్ళు? కొన్ని క్షణాలు ఆశ్చర్యపోయింది. తమాయించుకుని కొంత సేపటికి అనగలిగింది. "సాయంత్రం మా యింటికి రండి యిస్తాను"

"థాంక్స్"! చిరునవ్వుతో అన్నాడు అతను. తను యిదే మొదటసారి అతన్ని చూడటం, తన క్లాసు మేట్ అన్నమాట అతను. అందగాడె అనుకున్నది. ఈ ఆలోచనలతో యిల్లు చేరేసరికి ఆరు గంటలయింది. అమ్మలేదు యింట్లో దేవాలయానికి వెళ్ళినట్లున్నది. యింట్లో తను ఒక్కతె ఉన్నది. గబ, గబ స్నానం ముగించి తన కిష్టమయిన లేతగులాబి రంగు చీరకట్టుకొని దానికి మ్యాచ్ అయ్యే జాకెట్టు వేసుకున్నది. ఆ రోజు తనకే ఎంతో అందంగా ఉన్నట్లనిపించింది తనవిశాల అద్దంలో చూచుకుంటుండగా.

"ఏమండి" అన్న పిలుపు వినిపించి వెనక్కి తిరిగి చూచింది. అందంగా, హుందాగా, నవ్వుతు నిల్చుని వున్నాడు అతను.

"రండి కూర్చోండి" నవ్వుతు ఆహ్వానించింది తను అతను కూర్చొని హాలు నలుమూలలా కలియ చూస్తుండగా, కాఫీ తీసుకొచ్చి అతనిముందు టేబులు మీద ఉంచింది. తన వైపు సూటిగా చూడసాగాడు అతను, తనకేమిటోలా అనిపించింది. అతను అలా చూడటం, తను భయంగా అతని కళ్ళల్లోకి చూడ సాగింది. అతను ఎందుకో నవ్వాడు. మంత్ర ముగ్ధరాలు లాగా నోట్సు తీసుకొచ్చి అతని చేతిలో ఉంచింది. "థాంక్స్"! అంటు నవ్వుతు వెళ్ళిపోయాడు అది అతను తొలి. తమ పరిచయానికి నాంది. అతను అది మొదలు తరచు ఏదో సాకుతో యింటికి వచ్చేవాడు. తనతో ఎంతో చనువుగా, ఆత్మీయతగా మాట్లాడేవాడు. అతన్ని చూడంది తను ఒక్కరోజు అయిన ఉండలేకపోయేది. అతని పేరేమిటో తెలుసుకోవాలనిపించి కూడా. ఆ ప్రయత్నాన్ని అప్రయత్నంగా విరమించుకొనేది. అతనే తన పేరును వెల్లడించాడు. కరోజుతనకు బాగా జ్ఞాపకం, తెల్లని పాలనురుగు లాంటి చీర కట్టుకొని, తల్లో జాజులు తురుముకుంటుండగా నవ్వుతూ అన్నాడు.

"భానూ! మిమ్మల్ని చూస్తుంటే యిప్పుడే విచ్చుకున్న తెల్ల కలువ గుర్తుకొస్తున్నది. ఎవరా అదృష్టవంతుడు?" తన కళ్ళల్లోకి సూటిగా చిలిపిగా అన్నాడు" తను ఏమి చెప్పలేక నవ్వి ఊరుకుంది. తన మనస్సులో అతనివి ఆకర్షణీయమైన నయనాలు అని పదే, పదే, అనుకున్నది. "మీ నవ్వు వెన్నెల జల్లులా ఉన్నది" చిన్నగా అన్నాడు అతను. తను ఆ మాటతో ఉక్కిరి బిక్కిరి. అయిపోయింది.

"భానూ! ఏంమాట్లాడరు? నేను మీకు తగినవాడ్ని కానా?" జాలిగా, అమాయకత ఉట్టిపడె స్వరంతో అడిగాడు. తన ఆశ్చర్యానికి అంతులేకపోయింది. అతని కోరిక వినగానే.

"ఏం భానూ నన్ను వివాహం చేసుకోటం నీకు యిష్టంలేదా?" రెట్టించి అడిగాడు ఆక్షణంలో తన మనస్సు స్వప్న వీధులలో విహరించ సాగింది.

"భానూ! మన ఈ రెండు నెల్ల పరిచయంతో నీ మనస్సు ఎంత సున్నితమయినదో తెలుసుకోగలిగాను. నా మనస్సు ఎలాంటిదో తెలుసుకోలేకపోయ్యావన్న మాట" బాధగా అడిగాడు అతను.

తన కళ్ళల్లో నీళ్ళు నిలిచినాయి అతని బాధను చూచి. అతని మాటలకి మంచులా కరిగిపోయింది.... రోజులు ఆనందపుటంచులు దాటి వేగంగా దొర్లిపోతున్నాయి. ఒకర్ని, ఒకరు విడపలేనంత ఆత్మీయత పెనవేసుకుంది తమని.

బి. ఎస్. రాణి

"భాను మా తల్లి తండ్రులకు నేను ఒక్కణ్ణే, సిరి సంపదలకి లోటులేదు. నీవు నాఅర్ధాంగి వయిన మరుక్షణం నించి నీకు ఎలాంటి లోటు జరగబోదు. నా సర్వస్వం నీవే భాను!" ఆ సంతోషంలో ఏవేవో అనేశాడు. అతని పలుకులకి తన మనుస్సు గాలిలో తేలిపోగా తను అతని చేతుల్లో వాలిపోయేది

అమ్మకు తనూ ఒకతే సంతానం. తన మాటకు ఎదురు చెప్పేదికాదు అమ్మ. చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టుకున్న దురదృష్టవంతురాలు తను. ఒక చిన్న యింట్లో అమ్మ, తనూ ఉండేవారు. నాన్న పోతు మిగిలిచిపోయింది ఏమిలేకపోగా కొద్ది అప్పులు మాత్రం నిల్చిపోయినాయి. తన చదువు కయితే నేమి, సంసారం గడవటం కోసమయితేనేమి ఉన్న యిల్లు ఒక్కటి అమ్మవలసివచ్చింది. అమ్మగా వచ్చిన పాతిక వేలతో సంసారం, చదువు అన్ని సాగిపో తున్నాయి. ఇటువంటి పరిస్థితులలో తను చదివి ఉద్యోగం చేయటం మంచిదనిపించింది. తను బి. ఏ ఫైనల్ ఇయర్ చదువుతుండగా అతనితో పరిచయం అయింది. ఆ పరిచయమే ప్రణయంగ రూపులు దిద్దు కుంది. ఆరోజు తను మరువలేదు జీవితంలో. అతని తల్లికి సీరియస్‌గా ఉన్నట్లు టెలిగ్రామ్ అందగానే అతని బాధ చూడలేకపోయింది. తనను విడిచి వెళ్ళ వలసివచ్చి నందుకు, ఎంతగానో బాధ పడ్డాడు. అతని నుంచి దూరంకావటం అంటె ఎంతో కష్టమనిపించింది తనకు.

"భానూ! నిన్ను దూరం చేసుకోవాలంటె మనస్సు ఒప్పటంలేదు. కాని పరిస్థితుల ప్రాబల్యానికి లొంగి పోక తప్పదు. వివాహ శుభదినం కోసం ఎదురు చూస్తుంటావు కదూ? అమ్మా, నాన్న నా మాట కాదనరు. నీవు నా భాగస్వామివి కావాలని ఎప్పుడు కోరుతుంటాను" అతని కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరగ నారంభించినాయి. యిక మాట్లాడలేకపోయాడు. తను అతని చేతుల్లో తల దాచుకుని బావురుమన్నది తనని అన్యాయం చేయవద్దని. తనని పసిపాపలా లాలించి, మురిపించి వీడ్కోలు తీసుకొని ప్రయాణ మయ్యాడు. అతను వెళ్ళిపోయాడు. వెళ్ళగానే ఎన్నో ఉత్తరములు వ్రాసింది తను. అతని నుంచి సమాధానంగా వచ్చిన ఆఖరి ఉత్తరం యిదె. చంపల మీదగాజారుతున్న కన్నీళ్ళు చేతులోని ఉత్తరాన్ని తడిపివేస్తున్నా భాను నిర్జీవంగ కూర్చుండి పోయింది.

గూళ్ళను చేరుకుంటున్నాయి గువ్వల జంటలు. ఆకాశంలో అందమయిన శుక్రతార ఉదయించింది. దూరాన ఆలయంలోని గంటలు భారంగా మోగు తున్నాయి. భాను హృదయంలో ఆరని మంటలు రేగినాయి. తుదిలేని నిరీక్షణ ఆమెది—



# శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్



పరశువేది యే వస్తువును తగిలినను ఆ వస్తువు బంగారముగా మారును. శ్రీమతి దుర్గాబాయమ్మగారు యే పని చేపట్టినా బంగారమగును. ఏ పరిస్థితులలోనయినా, వారి ఆలోచనలు, ఎప్పుడూ స్త్రీలు దేశానికి ఎట్లా వుపయోగపడతారా అనే. దేశము ప్రశాంతముగా వున్నప్పుడు, అన్ని తరగతుల స్త్రీలు, ఎట్లా స్వయం సంపాదనపరులుగా, అగుదురా అని వారి ఆలోచన. అందుకోసం, షుమారు 30 ఏళ్ళనుంచి వారు చేస్తున్న కృషి, స్థాపించిన సంస్థలూ మనందరం ఎరిగినవే. వారు స్థాపించిన సంస్థలలో తర్ఫీదయి, కొన్నివేలమంది స్త్రీలు స్వయం ఆర్జితపరులుగా తయారయి, దేశమంతటా, అనేక రంగములలో కృషి చేస్తున్నారు. స్త్రీ జనాభ్యుదయమునకు వారిచే స్థాపింపబడిన సంస్థలు బహుశాఖోపశాఖలై ప్రతి సంవత్సరమూ విస్తరిల్లుచున్నవి. అసలు సిసలైన కాంగ్రెసువాదులలో పదవీ వ్యామోహ మిసుమంతయూలేక, స్త్రీల, వికలాంగుల, బాలుర సంక్షేమమే ప్రధానముగా నిరంతర కృషి జరుపుచున్న శ్రీమతి దుర్గాబాయమ్మగారు ఏవదాంధ్రులకు గర్వకారణము.

దుష్టబుద్ధిగల చైనీయులు, మిత్రద్రోహమునకు తలపడి, అన్యాయముగా మన భూభాగముపై దండెత్తి, చొచ్చుకొనివచ్చి, కొన్నివేల మైళ్ళు ఆక్రమించుకొనుటయూ, మన ప్రభుత్వము "దేశము అత్యాయిక పరిస్థితిలో నున్నట్లు" ప్రకటించుటయూ, మనమందర మెరిగినదే. ఇప్పట్టున, శ్రీమతి దుర్గాబాయమ్మగారి దృష్టి, దేశరక్షణ కత్యావసరమయిన జవానుల సంక్షేమముమీద ప్రసరించెను. వెంటనే స్త్రీలకు నర్సు ట్రైనింగు యిచ్చి, స్త్రీలనుకూడా యుద్ధసన్నిద్ధ సేవకురాండ్రుగా తయారుచేయుటకు ఒక పథకమువేసి, గవర్నమెంటువారి అనుమతి, ఆర్థికసహాయముపొంది మొదటి జట్టుగా 50 మంది స్త్రీలను, హైదరాబాద్ ఆంధ్రమహిళా సభ ఆధ్వర్యమున, హాస్టలు వసతులతో, తయారుచేయుటకు, అన్ని యేర్పాట్లూ జరుపబడెను. వచ్చే సంవత్సరము నుంచి 100 స్త్రీలని హాస్టలు వసతులతో నర్సు తర్ఫీదు యిచ్చుటకు చురుగ్గా ఏర్పాట్లు జరుగుచున్నవి.

గాంధీమహాత్ముడు యీ దేశమున ముఖ్యముగా స్త్రీలకు చేసిన మహోపకారములలో ఎన్నతగినది, స్త్రీజన నాయకురాండ్రుగా శ్రీమతి సరోజినీ దేవి, శ్రీమతి దుర్గాబాయమ్మగారు వంటి సేవాధురంధురాండ్రను తయారుచేయుట. శ్రీ భగవత్ గీతయందు శ్రీకృష్ణభగవానుడు చెప్పినట్లుగా, నిస్వార్థ, నిష్కామ "కర్మ" ఆచరించుటయే వీరిపని. అందుచేతనే వీరు తలపెట్టిన ప్రతిపని సత్వర, సత్ఫలితముల నిచ్చుచున్నవి.

శ్రీమతి దుర్గాబాయమ్మగారు చేపట్టిన ప్రతి సంక్షేమకార్యమూ దిగ్విజయము గాంచుటకు ప్రప్రధాన కారణము వారి నిష్కల్మష అంతరంగికమే. వారు ఒక మొబైల్ వెల్‌ఫేర్ యూనిట్. అట్టివారి సమకాలీనులుగా జీవించుటయూ, వారిచే స్థాపింపబడిన స్త్రీ జనాభ్యుదయ సంస్థలలో పనిచేయుటయూ ఎవరికైననూ గర్వకారణము.

— టి. ప్రసాదరావు

రెండు భాగాల కథ:

# అరిటాకు



సాయంకాలం. విపరీతమైన ఈదురుగాలి వీస్తోంది.

రేవతికి తనగదిలో కూర్చుని చదువుకో బుద్ధికావటం లేదు. బయటికివచ్చి వరాండాలో స్తంభాని కానుకుని ఎదరకు చూస్తోనించుంది. ఎదురుగా వున్న ఆఫీసర్స్ కాలనీలో ముందుభాగంలో టెన్నిస్, ఆడుకుంటున్నారు. చుట్టూ "బార్బ్‌డ్ వైర్"తో కట్టిన "ఫెన్సింగ్" మీది బటాణీ గులాబీలు చిన్నగా మూగగా బాధగా ముడుచుకుంటున్నాయి, అరకుచుక్కల్లాంటి వాటి ఆకులు, ఇనపముళ్ళకి తగిలి చీలుతున్నాయి. గాలికి ఇటూ, అటూ పరుగెట్టుతున్న నీలాకాశంమీది మబ్బులు ఎర్రగా కాలే ఎడారి ఇసుక దబ్బలల్లె వున్నాయి. రేవతి ఇంటి ముంగిట్లో వున్న ఒకే ఒక అరటిచెట్టు ఆకులు, ప్రక్కనున్న నారింజచెట్టుమీదికి వాలివున్నాయి. ప్రతి చిన్నగాలి తాకిడికి, ఆ ఆకుల చివర్లు చీలుతూనే వుంటాయ్. ఒక్క అరటిఆకు కూడా చిరగకుండా వుండదు. మానవుని చివరి కాంక్షల్లే అరుణాస్తమయం అవుతూ కూడా, చివరిసారిగా, తన తేజస్సుని, వివర్ణాకాశంమీద, విస్తృతపరుచబోయి, విఫలుడౌతున్నాడు భానుడు, ఈ సృష్టి ఆదినించీ కొన్ని అద్భుతాలను సృజిస్తోంది. ఆ అద్భుతాల గారడీనించి తప్పించుకునే, శక్తియుక్తులు మానవ, మానసిక నీరధిలో మునిగిపోతున్నాయి. చినిగిపోయిన అరిటాకు చీలికలు, రేవతి మనస్సుతో మౌనసంభాషణ చేస్తున్నాయి. రేవతి కళ్లు ఎర్రబడ్డాయ్! నెమ్మదినెమ్మదిగా, ఆమె కనుకొలకుల్లోని స్వచ్ఛస్ఫటికాలతడిలో, శ్రీనివాస్ నవ్వుతూ ప్రత్యక్షమయ్యాడు.

"నిన్ను ప్రేమిస్తున్నాను రేవతీ!"

"మీ మగాళ్లతోవచ్చిన చిక్కేనోయ్ ఇదీ! రెండు సార్లు స్నేహంగా మాట్లాడితే ఇంకకథలోకివచ్చేస్తారు" అన్నది రేవతి.

"మరి ఈ స్నేహానికర్థంఏమిటీ? "

"స్నేహానికర్థం స్నేహమే ! నేను. శారదతోనూ. నీరదతోనూ, సుభద్రతోనూ స్నేహం చేస్తున్నాను, నువ్వు నీస్నేహితులతో మాట్లాడుతున్నప్పుడు, నేను వీళ్లతో మాట్లాడుతున్నప్పుడు, ఇల్లాంటిమాటలు వుపయోగించాల్సిన అవసరంవుండదు. కనుకమనం అందరం కూడా, ఒకరితో ఒకరం స్వేచ్ఛగా హాయిగా మాట్లాడుకోగలగాలంటే ఆ పదం వర్జించాలి."

ఆరోజుకి వెళ్లిపోయాడు. రేవతితెలివైనది. అందమైనది. తన అభిప్రాయాలను, నిస్సంకోచంగా చెప్పేయిగల మనోనిశ్చలత కలది. అదే ఆమెతండ్రికీ నచ్చుతుంది. కొందరు తండ్రులు తల్లులువుంటారు. వాళ్లపిల్లలకి వయస్సుల్లో ఏయే అభిరుచులుకలుగుతవోవాళ్ల వూహలకు అందవు. పిల్లలు పదిసంవత్సరాలు దాటిన

తర్వాత తమచుట్టూరా వున్న రంగులప్రపంచంలోని, వివిధానుభూతులకూ, వశమవుతూ, ఏ అనుభూతినైతే, వాళ్ల శరీరమూ, మనసూ, కూడా, మళ్లీమళ్లీ కావాలని కాంక్షిస్తుందో, ఆ అనుభూతిని పొందగలగటమే, వాళ్ల జీవితధ్యేయం, కావాలని కలలుకంటారు. దానికి తగిన అనుకూలపరిస్థితులు కల్పించటం తల్లితండ్రుల బాధ్యత అయివుంది. శివనారాయణగారు అల్లాంటి ఆదర్శపూరితమైన తండ్రి. అందువల్ల ఆయనపిల్లలు ఆయనవద్ద నిస్సంకోచంగా పెరిగారు. వాళ్లవాళ్ల మానసికపరిధుల్ని బట్టి విస్తృతమయ్యే ఆశలునెరవేర్చుకున్నారు. ఆరో అమ్మాయి రేవతి, అల్లారుముద్దురేవతికూడా ఆ వరవడిలోనే తనజీవితపు పరవడిన, నిశ్చలంగా, నిర్మలంగా, అలకనందా ప్రవంతిలా, నడకకానినడకని, పరుగుకానిపరుగుని, అందంకాని అందాన్ని అనురాగంకానిఅనురాగాన్ని మేళవించుకున్నది. నెలరోజులుపోయాక కాలేజీ వెనకాతలి మర్రిచెట్టుదగ్గర కలుసుకున్నాడు శ్రీనివాస్. రేవతి మర్రివూడని పట్టుకొని నించుంది. ఆవూడ ఆమెలోని అభిప్రాయలల్లే బలంగా నేలకు తన్నివేళ్లు బారి నించుంది.

"నెల్లాళ్లూ ఒకటే ఆలోచన రేవతీ! మనస్నేహానికి నాకింకోఅర్థం స్ఫురించటంలేదు. శ్రీనివాస్‌కళ్లు సాయంకాలం" నీరెండలో కాశీరత్నం పువ్వులల్లే చిత్రంగా మెరవసాగాయ్.

"ఎన్నిసార్లు చెప్పానునీకు! స్నేహానికర్థం స్నేహమే అని! అయినా ఇది నీ ఒక్కడిలోనూ కలిగే సంచలనం కాదు శ్రీనివాస్! ప్రతీపురుషునికీ, స్త్రీకీ వుంటుంది. స్త్రీ స్త్రీతో, పురుషుడు పురుషుడితో మాట్లాడుకున్నంత ఫ్రీగా స్త్రీపురుషులు మాట్లాడుకోలేరు. స్నేహాలు చేయలేరు. అందరూ మనుష్యులే. అందరు అందరితో స్నేహాలుచేయటం, సరదాగా కబుర్లు చెప్పుకోవటం ఎందుకు జరగదు? ఇదికూడా వుభయుల్లోనూ వున్న మానసిక దుర్బలత! రెండుసార్లు ఒక పురుషుడు తనతో మాట్లాడాలన్న కుతూహలత చూపిస్తున్నాడనుకొనే సరికి అతను తనలోవున్న ఏదో అలౌకిక సౌందర్యానికి దాసుడయ్యాడనుకుంటుంది. స్త్రీ అల్లాగే పురుషుడూ భావిస్తాడు. దానితో ప్రేమచర్చలూ! అవివాహితలైతే వివాహంతోసరి అవుతుంది. ఇరువురూ వివాహితలైతే లోకం అంత పట్టించుకోదు. కాని ఇరువుర్లో ఒకరు వివాహితులూ, రెండవవారు అవివాహితులూ అయితే, ప్రతివారూ, కథకులు అయిపోతారు. వీటిని అధిగమించి. సాదా స్నేహాలు సాదాగానే, వుంచుకోవాలని నా అభిప్రాయం."

శ్రీనివాస్ ఏమి అనలేదు. ఆ అమ్మాయి అందానికి కలిసికట్టుతనానికీ అతని మనస్సు ముగ్ధమౌతున్నది. తనపట్ల ఆమె విముఖతచూపించితే, అతనిలోని ఆశ అణగారిపోవును. కాని ఆమె చూపుతున్న స్నేహవాత్సల్యాలు అతన్ని వేరువిధంగా ఆలోచించనీయటంలేదు. రేవతి అందానికి ఆమెలోవున్న సంస్కారయుతమైన మానసిక సౌందర్యానికి అతను వివశుడౌతున్నాడు.

ఫిబ్రవరి నెలలో ఆఖరువారం. ఆఖరుసారిగా రేవతిని అడిగాడు. ప్రైవేట్‌క్లాసునించి ఇంటికి వెళ్లిపోతోంది రేవతి. శ్రీనివాస్ దూరంనించే ఆనవాలు పట్టేడు.

"ఆగు రేవతీ!"

రేవతి ఆగిపోయింది.

"ఈ ప్రక్కసందులోనే మాఇల్లు, ఒకసారి రాకూడదా?" అన్నాడు.

"ఎల్లారాను? నాకు మీ ఇంట్లో నువ్వుతప్ప ఇంకెవ్వరూ తెలియిరే!" అన్నది సందిగ్ధంగా.

"నేను చెప్తానులే! మాఅక్క బావా వున్నారు. అంతే!"

"ఏమని చెప్తావు?"

"మా స్నేహితురాలని."

తనుచెప్పిన పాఠం తనకే అప్పచెప్పాడు అనుకున్నది రేవతి.

"మరి, ఇన్నాళ్లూ పిలిచావుకావేం!" నిలదీసింది.

"నాకాలోచనే తట్టలేదు" అనేశాడు.

"నేను చెప్పనా! ఇన్నాళ్లూ నాగురించి నీఅభిప్రాయాలు వేరు ఇకముందునించీ వేరుఅవబోతున్నాయి. మీ ఇంటికి తీసుకవెళ్లుతావు. మామూలుగా పరిచయం చేస్తావు. నేనువచ్చిన తర్వాత మీ అక్క, నీకు అడంగి స్నేహాలేమిట్రా అని తిడతారు. అప్పుడు ఆ అమ్మాయిని నేను ప్రేమించాను. పెళ్లిచేసుకుంటాను. అని చెప్పొచ్చును. అంతేకదూ?"

శ్రీమతి కె. వి. యస్. అచ్యుతవల్లి

ఆశ్చర్య పోయాడు శ్రీనివాస్.

"బలే! సరిగ్గా వూహించావు."

"ఇందులో నన్ను మెచ్చుకోవాల్సినంత విశేషం ఏమీ లేదు. ఇన్నాళ్లూ నాముందు చెప్పిన ఉపోద్ఘాతం తరువాత గ్రంథం ఎల్లా నడవబోతోందో, గెస్ చేయిలేక పోతానా?"

''ఎప్పటికయినా నువ్వు పెళ్లిచేసుకోవాల్సినదానివే కదా! మరి నాలోవున్న అనర్హతలేవిటో చెప్పకూడదా?''

రేవతి మాట్లాడలేదు. శ్రీనివాస్ ఉత్తేజంగా అన్నాడు.

''నిజం, రేవతీ! నిన్ను మొదట్నించీ కూడా ఒకలాగా ప్రేమిస్తున్నాను. నువ్వు అనుగ్రహించకపోతే ఆత్మహత్య చేసుకుంటాను " రేవతి నవ్వింది. స్వచ్ఛ మైన తామరపూవు విరసినట్లుందా నవ్వు.

''చెప్పానుకదా! నా స్నేహం, నీకు అపార్థం కలిగించింది."

"అంతకన్నా మరేం విశిష్టత నాలోలేదా?"

'' వుండొచ్చును లేకపోవచ్చును. నాకనవసరం. నీ మనస్సు మలినమవుతుంది. దీన్నిగురించి ఆట్టె తర్కించకు.''

"ఎల్లావుంటాను. రేవతీ!" పంకే జాయిత ఇ.తి. పంకజం అన్నారు. ఆ మలినంలోంచే నాస్వచ్ఛ ప్రేమ తామరపూవులా వికసించింది. నామనస్సు ఆ మలినాన్నే పదే పదే మననం చేసుకుంటున్నది."

రేవతి మాట్లాడకుండా వెళ్లిపోయింది. మళ్లీ కాలేజికి రాలేదు రేవతి. శ్రీనివాస్ ఆలోచించాడు తను అన్తమానం వేధించటం వల్ల మానేసిందా అని మధన పడ్డాడు. వాళ్లిల్లు కనుక్కుందా మనుకున్నాడు. రేవతి క్లోజ్ ఫ్రెండ్స్‌లో సుభద్ర. తనకి తెలుసు. దూరపు బంధువు కూడా.

''రేవతి ఇల్లెక్కడ?'' అన్నాడు.

సుభద్రకి శ్రీనివాస్ అంటె సద్భావంలేదు. అతనొక జగమొండి అని ఆమె అభిప్రాయం. రేవతి ఎందుకని కాలేజీకి రావటంలేదో సుభద్రకి ఆ వుదయమే తెలిసింది. ఈ సమయంలో ఇతను వెళ్లి రేవతిని చికాకు పరుస్తాడేమో అని ఆమెభయం!

"నాకు తెలియదు'' అన్నది.

దానితో శ్రీనివాస్‌కి ఇంకో అభిప్రాయం కూడా బలంగా ఏర్పడినది. రేవతి తననించి తప్పించుకోవటం కోసమే కాలేజీ మానేసిందనీ, ఇల్లు ఆనవాలు తను అడగొచ్చుఅని వూహించి రేవతే సుభద్రని, తెలియదు పొమ్మని చెప్పమన్నదనీ అనుకున్నాడు శ్రీనివాస్‌లో ఒకవిధమైన పట్టుదల కార్యదీక్షవున్నాయి

''నీకు తెలియకుండా వుంటుందా?''

"నే నెప్పుడూ వాళ్లింటికి పోలేదు."

''అల్లాగా! అయితే రేపు నేను మీఇంటికి వస్తాను.

సుభద్ర ఇల్లు అతనికి తెలుసును. సుభద్ర ముఖం విప్పారింది.

''ఎందుకూ! మానాన్నగారికి అసలు తెలియదు రేవతి ఇల్లు!"

''మరి ఆయనకి తెలియనివి చాలావున్నయ్. అవి అన్ని తెలియచెప్పొద్దా?'' నుదురు చిట్లించి నవ్వాడు.

''ఏమిటో అవీ!"

''మొదటిది. రేవతి ఇల్లు ఎక్కడుందో. రెండవది. నువ్వు కాలేజీలో డ్రామాలు వెయ్యటం.''

గతుక్కుమంది. సుభద్ర,

సుభద్రకి డ్రామాలువెయ్యటం సరదా. అది వాళ్ల నాన్నగారికిష్టం వుండదు. అందుకని చెప్పకుండా వేస్తోంటుంది. అల్లాఅని తండ్రికి వ్యతిరేకంగా ఏపనీ చేయదు. ఒక్కొక్కళ్ళకి ఒక్కొక్క అభిరుచి వుంటుంది. ఆ అభిరుచిని పెద్దవాళ్లుకూడా మెచ్చుకోగలిగితే ఈ పిల్లలు ఎస్కేపిజంకు అలవాటు పడరు. వాళ్లకి తల్లి తండ్రుల పట్ల గౌరవమూ, వారు ఆదరించలేని తమ అభిరుచి పట్ల ఆపుకోలేని అభిలాషా వుంటాయ్. అంచేత వాళ్లు ఎస్కేపిస్టులు అవుతారు.

''అయినా రేవతి వూళ్లో లేదు." అబద్ధంచెప్పేసింది. "లేకపోయినాసరే! వాళ్ల ఇల్లు ఎక్కడో్ం చెప్పు. లేకపోతే మనశక్రటరీ రామానుజంతో మీనృత్యనాటికకు ప్రయిజ్ లివ్వటానికి మీనాన్నగారిని పిలిపించమంటాను. " నిష్కర్షగా చెప్పేసాడు.

సుభద్ర ఆలోచించింది. తను అనవసరంగా రేవతిని గురించి అపోహపడి, ఇతనితో కలహం తెచ్చుకుంది. కాని తనుచేసిన వుపకృతి రేవతికి గుర్తువుంటుందా! హాయిగా ఇంజనీయిర్ భార్యఅయి తనదారిన తను

పోతుంది. ఇతనుమాత్రం ఆమెని ఏం చేయకలడు? అయినా రేవతి తనతో ఇతనివల్ల తను భయపడు తున్నట్లుచెప్పిందావిమిటి? తనే అనవసరం గొడవలు పట్టించుకుంటోంది. శ్రీనివాస్ వెళ్లిపోబోయాడు.

"ఆగండి."

విజయకోట వీరుడులా నిలబడ్డాడు.

"పార్కునార్త్‌గేటుకెదురుగావున్న సందులో అరటి చెట్టున్న ఇల్లు." అనేసి వెళ్లిపోయింది.

"నీకు ఫస్ట్ ప్రైజ్ వొచ్చేట్లు చూస్తాను" అన్న అతని మాటలు గాలిలో కలిసిపోయాయి.

గేటు తీసుకుని నిర్భీతిగా వస్తున్న శ్రీనివాస్‌ని చూడగానే రేవతి అంతరంలో ఏదో అలజడి చెలరేగింది. అయినా, నిగ్రహించుకొని, "రా. కూర్చో!" అని కుర్చీ చూపెట్టింది.

ఇల్లంతా క్లీన్‌గా వున్నది. లోపల ఎక్కడో పిల్లల సందడి విన్పిస్తోంది. వంటింట్లోంచి కమ్మని పోపుల వాసన వేస్తోంది.

"కాలేజీ మానేసుకున్నావేం!"

రేవతి మాట్లాడలేదు. ఏం చెప్పాలో ఎల్లా చెప్పాలో ఆమెకి తెలియలేదు.

"వో! మౌనవ్రతమా! ఇదెప్పట్నుంచీ! మాటకు ముందే లెక్చరిచ్చేదానివీ?"

పిల్లికి చలగాటం ఎలక్కి ప్రాణసంకటం అంటే ఇదే!

"నిజానికి మాటకి, పదిమాటలు చెప్పే అడదంటే, నాకు మొదట్నుంచీ ఇష్టంలేదు." తనకోసమే ఆమె మౌనం అలవర్చుకున్నట్లు చెప్పుకొస్తున్నాడు.

"మొదట్లో నీ వక్తృత్వాన్ని సహించలేకపోయేవాణ్ని. అల్లా వూరికే నీ కదిలే లేగులాభిరేకల పెదాల్నీ, చలిస్తున్న కనీనికల్నీ, మెరుస్తున్న మంచిముత్యాల్లాంటి పలువరసనీ చూస్తూ కూర్చునేవాణ్ని. నువ్వు ఇవ్వాళ ఇల్లా మౌనంగా నించోటం, అచ్చంగా, సుందర గ్రీక్ శిల్పాన్ని గుర్తుకు తెస్తున్నది."

శివనారాయణగారు లోపల్నించి వచ్చారు. శ్రీనివాస్ లేచి, "నమస్కారం" రెండు చేతులూ జోడించి అన్నాడు.

ఆయన ప్రతిగా చేతులు జోడిస్తూ "కూర్చోండి ఎవరు?" అన్నారు.

"నేను ప్రిన్స్‌పాల్‌గారి మేనల్లుణ్ని. రేవతి రావటం లేదేమని, కనుక్కోమన్నారు మామయ్య."

రేవతికి శ్రీనివాస్ మీద కోపం వచ్చింది. ఎంత సులువుగా అబద్ధం చెప్తాడు?

ప్రిన్స్‌పాల్‌గారు, శివనారాయణగారికి సన్నిహిత బంధువు. ఆయనకి రేవతి అంటే అభిమానమని శివనారాయణగారికి తెలుసు.

"దానికి వివాహం నిశ్చయం అయిందోయ్. ఇంట్లో సందడి. అంచేత మానేసింది. పరీక్షలకి వస్తుందిలే. సాయంత్రం వొచ్చి మామయ్యతో చెబ్దామనుకున్నాను."

శ్రీనివాస్‌కి శరీరం జలదరించింది. తన ప్రేమని నిర్లక్ష్యంచేసి రేవతి పెళ్ళికూతురుగా కులుకుతున్నదన్న మాట!

"లెక్చరర్స్ క్లాస్ ఎక్స్‌పెక్ట్ చేస్తున్నారు. ముహూర్తం ఎప్పుడు పెట్టారేమిటి?" పెద్దమనిషిలా అడిగాడు.

"వొచ్చే బుధవారమేనోయ్: దాని అదృష్టంకొద్దీ తటస్థపడింది. పెళ్ళికొడుకు చూస్తూనే వొప్పుకున్నాడు. బి. ఇ. ఆనర్సులో ప్యాసయ్యాడు" సంతోషంగా చెప్పాడు.

"వొస్తానండీ! రేవతీదేవిగారూ!" వెళ్ళిపోయాడు శ్రీనివాస్.

అ పిలుపులో ఏదో వ్యంగ్యం వున్నట్లు స్ఫురించింది రేవతికి.

ఆఖరి అమ్మాయి పెళ్ళి పెద్ద ఆర్భాటంగా చేయబోతున్నారు. రంగురంగుల కాగితాల పువ్వులతో, విరిసీ విరియని మల్లెపూవుల్లాంటి కన్నెల కన్నుల సిగ్గులతో, జిలిబిలిగా అల్లిన జలతారుదారాల మెరుపుల తళుకులతో, అందంగా, అనురాగప్రేరితంగా అమర్చిన "షామియినా" క్రింద రేవతిని పెళ్ళికూతుర్ని చేశారు. పెళ్ళిపందిరి ముందు మగపెళ్ళివారి ఆగమనాన్ని, చిత్రాల్లో బిగించుకుందుకు కెమెరాలు రెడీగా వున్నాయి. స్టేషనుకు వెళ్ళిన నాలుగు టాక్సీలు ఖాళీగా తిరిగి వొచ్చాయి. రేవతి అక్కచెల్లెళ్ళు కంగారుపడ్డారు. భవిష్యత్తు గురించి తపించిపోయారు.

(ముగింపు వచ్చేసంచికలో)



# ★ అల్లుడు ★

(ధనుర్మాసపు వేకువవేళ. వీధివెంట భజనకూటం మేలుకొలుపులు పాడుకుంటూ దూరంనుండి క్రమంగా దగ్గరకువచ్చి మళ్ళీ దూరంపోతూ క్రమంగా సన్నగిలిపోతుంది).

(తలుపు తడుతున్న చప్పుడు)

ఒక యువతికంఠం: అమ్మా, తలుపు తియ్యవే.

**అమ్మ:** (దూరంనుండి) ఎవరూ.... ఎవరదీ? (తలుపు తీసిన చప్పుడు) నువ్వాటే అమ్మడూ. అల్లుడేడీ? ఎప్పుడు వస్తానన్నాడే? తెల్లవారుఝాము బండిలో నువ్వొక్కత్తెవే దిగావుటే? మాట్లాడవేమే! ఏమండోయ్. మిమ్మల్నే పద్మ వచ్చిందండీ.

**పురుషకంఠం:** (దూరంనుండి దగ్గరగా వస్తూ) పద్మ వచ్చిందా శాంతా. ఏం అమ్మాయి బాగున్నావా? శ్రీహరి ఎప్పుడు వస్తానన్నాడు!

**పద్మ:** రారు. పెళ్ళిలో ఇస్తానన్న స్కూటరు కొని ఇచ్చేసి, ఇప్పుడు ట్రాన్సిస్టర్ రేడియో పండుగ బహుమతిగా ఇస్తానంటే వస్తారుట.

**తండ్రి:** మనపరిస్థితి కొంచెం నచ్చచెప్పలేక పోయావా అమ్మా!

పద్మ: (తీవ్రంగా) అయితే చేతులు ముడుచుకు కూర్చున్నానంటారు. రాత్రంతా ఇదే గొడవ జరిగింది. అసలు ఏమయిందంటే....

(క్షణం విరామం)

శ్రీహరి: పద్మా పద్మా మీ నాన్న వుత్తరం వ్రాసారు. సంక్రాంతికి మన ఇద్దరమూ రావాలట. పండుగనాటిపుణ్యకాలంలో తమఅల్లుడూకూతురూ కళ్లెదుట తిరుగుతూంటే సంతోషిస్తారట. అందుకని వారికోరిక మన్నించి....

పద్మ: అయితే ఎప్పుడు వెళదామండీ?

శ్రీహరి: ఎప్పుడోనా, రాత్రిబండికే. ధనుర్మాసపు వేకువవేళ. శీతల మలయమారుతంలో ప్రయాణం ఎంత బావుంటుంది తెలుసా?

పద్మ: అంటే ఏమిటి—మీ ధోరణి?

శ్రీహరి: ఏం వుంది.... నువ్వు పుట్టినింటికి చేరుకునే వేళ వూహిస్తున్నాను.

పద్మ! నేను చేరుకోవడమేమిటి! మీరు రారా?

శ్రీహరి: రావాలనే వుంది. కాని ఏ మొహం పెట్టుకుని రానూ: పెళ్ళినాటి స్కూటరుకే దిక్కులేదు.

ఈపాటికప్పుడే ట్రాన్సిస్టరు రేడియో మీదికి పోయింది మనసు. ఈ పండుగ పుణ్యకాలంలో తీరికూర్చుని 'ఆశా నిరాశేనా మిగిలేదీ చింతేనా?' అంటూ విషాదగీతాలు పాడుకోవడం నాకిష్టంలేదు మరి.

పద్మ: ఏం మనుషులండీ. మా నాన్న పరిస్థితికి కొంచెం అయినా సానుభూతి లేదు. మా అక్కయ్యకోసం పల్లెలో ఇల్లు అమ్మేశాడు. నాకోసం పొలం బేరం చూపాడు గాని కుదరక మీ కోరిక తీర్చలేకపోయాడు. ఇంకా తమ్ముడూ చెల్లీ వున్నారు. అన్నీ మనమే న్రాడ్చేస్తే వాళ్ళ గతేం కావాలి.

శ్రీహరి: ఇదిగో అమ్మాయ్! - "ఎంతమంది తిండి లేక మాడుతున్నారో. మన కెందుకు రోజూ ఈ పండుగ భోజనాలు? మనం కూడా గంజినీళ్లు తాగి బ్రతికేద్దాం". అనుకున్నాడట వెనుకటి కెవడో నీలాంటివాడే. మీ నాన్న కష్టపడడం లేదనను. చాల కష్టపడుతున్నాడు. అలాగే మూడువేలు పెట్టి పెద్ద అల్లుడ్ని తెచ్చాడు. రెండో అల్లుడూ సులువుగానే దొరికాడు. రేపొద్దున్న మూడో అల్లుడ్ని సంపాదిస్తాడు. ఫరవాలేదు. ఇంతులోటూ కొడుకు తీర్చేస్తాడులే. ఇంక మా సంగతంటావా? ఇంకొన్నాళ్లుపోతే మేమూ మా అల్లుళ్ళకు ఇదంతా అప్పగిస్తాము. ఇదంతా ట్రాన్సఫరబుల్ వెల్త్. కొన్నాళ్లు అనుభవించు తరువాత ఇంకొకడికి ఇచ్చెయ్యి. అంతే!

పద్మ: వోహో ఏమి లాజిక్కండీ. తాటిచెట్టు ఎందుకెక్కావూ అంటే దూడగడ్డికోసం అన్నట్టు.

శ్రీహరి: అలా అన్నావా? ఈ క్షణాన నువొక్క మాటు-నాకు పట్టుచీరలూ నగలూ అక్కరలేదు. పూరిపాకలో నారచీరలో జీవితమంతా సంతృప్తిగా గడపగలనూ అని అను. అనలేవు నాకు తెలుసు. రేడియో లాంబ్రెట్టా నా కొక్కడికేనా కావలసింది. డబ్బూ హంగులూ లేకపోతే ఎంత గొప్పవాడేనా బీదవాడే పద్మా: ఎటొచ్చీ అదెలా వస్తూంది అని ఆలోచించడం మానెయ్యి. నీ అంత సుఖజీవి ఈలోకంలో వుండడు. పోతే కానీ కట్నంలేకుండా వచ్చిన ఈ అల్లుడి చిన్నకోరిక మీ నాన్న ఆ మాత్రం తీర్చలేడంటావా పద్మా?

(క్షణం విరామం)

పద్మ: అదీ ధోరణి నాన్నా! చుట్టూ తిప్పి తిప్పి వదిలిపెడతారు. మా మామగారు కంఠంలో ప్రాణముండగా కొడుకు కాదు గదా కొండమీది దేముడైనా దమ్మిడీ ఇవ్వరు. ఇటు ఈ మనకోరికలు ఇలాంటివి. మీరు చూస్తే అలాగా. మీ అందరికీ సుఖ్యం వలిగిపోతున్నది నేనూ. ఎవరికి చెప్పుకునేది? ఎవరిని సమాధాన పరిచేది? పెళ్ళనే తిరగలిలో ఇంత నలుగుడుందని తెలిసింది కాదు.

శాంత: ఏమిటండీ ఇంకా ఆలోచిస్తున్నారూ? వచ్చినదగ్గర్నుండి అమ్మాయి దిగాలుపడివుంది.

రాఘవయ్య: నువ్వుకూడా దాంతోపాటు ఏడువు. అక్కడికి సరిపోతుంది. అల్లుడుగారి ధోరణి అదీ అమ్మాకూతుళ్ళ దోరణి ఇదీ. అక్కడికి ఏధోరణీ లేక గాలివాలుకు ఎగిరిపోయే గడ్డిపోచలాగ నేను మిగిలాను.

శాంత: అలా విసుక్కుంటే ఎలాగండి. కన్నందుకు అది బాధపడుతూంటే చూస్తూ ఎలా వూరుకోగలం చెప్పండి. ఆ మన బ్రతుకులేవో మనం తరువాత చూసుకుందాం. ముందు ఇదేదో చుడండి ఆపొలం బేరం ఫైసలుచేయండి. మా అమ్మ ఇచ్చిన చంద్రహారాలు ఇస్తాను అది అమ్మేస్తే దేనికైనా పని కొస్తుంది.

రాఘవయ్య: అది కాదు శాంతా! ఈ అల్లుడికోరిక కోసమని నీకెన్నో మధుర స్మృతులతో అభిమాన పాత్రమైన ఆహారం ఇచ్చేస్తావెందుకు? ఎందుకు మన కిలాంటి అల్లుడు దొరికాడు? కమ్మటి కల్లల్లో మునిగి, తీయటిస్మృతులతో తేలి, నిర్మలంగా తిరగవలసిన వయసులో అల్లుడెందుకు ఇంత భౌతికవాది అయిపోయాడు. మనసిచ్చి మనసుపుచ్చుకొనే బ్రతుకు మాధుర్యాన్ని ఆస్వాదించే అవకాశాన్ని ఎందుకు కోల్పోతున్నాడు? మనందర్నీ.

---

శ్రీమతి పి. సరళాదేవి

బాధపెట్టి—చల్లటిగాలికి క్షణంసేపు మైమరవగలిగే పిపాసను ఎందుకు చంపేస్తున్నాడు?

శాంత: బాగానేవుంది వరస. ఒక్కొక్క అల్లుడు దొరుకుతున్నప్పుడల్లా ఇదంతా వల్లిస్తూంటాడండి. ఏదేనా తనదాకావస్తేగాని లోతు తెలియదంటారు అలాగ్గా.... చిన్నవయసు ఏదో కావాలని ముచ్చటపడ్డాడు. దానికింత తోకపీకు డెందుకూ. ఈ మాటలన్నీ మనం ఆ నాడుద్ధరించినప్పుడు ఎవరైనా అంటే.... లేవండి. వెర్రి మొర్రి ఆలోచనలతో పొద్దుపుచ్చక బయలుదేరండి నాకు అవతల బోలెడు పనుంది.... వెళ్తున్నాను.

రాఘవయ్య: అన్నావు. ఆ మాట అనే అనుకున్నాను. నేను కట్నంలాంఛనాలతో సలక్షణంగా పెళ్ళి చేసుకున్నాననేగా నీవన్నమాట. ఇదగో విను. కాసేపు నా మనసు విప్పిచెబుతానువిను. ఇవాళెందుకో అడుగు పొరల్లోని జ్ఞాపకాలు పైకి వస్తున్నాయి. వెళ్ళిపోతున్నావా ? ఈ కాస్త వినవూ....

ఈ నాటి నీ అల్లుడుగారి వయసులో నేనెన్ని కలలు కన్నానో తెలుసునా ... కట్నాలూ కానుకలూ తీసుకోకుండా విధవా వివాహాలో వర్ణాంతర వివాహాలో చేసుకోవాలని మావీధిలోని కుర్రాళ్ళమంతా చిన్నజట్టుకూడి సంఘం పెట్టుకున్నాం. వీరేశలింగంగారి వుద్యమప్రభావం మామీదచాలా ఎక్కువగా వుండేది. రోజూ ఏటివడ్డున ఇసుకలో కూర్చుని మా వివాహాల కలలు మాటాడుకునేవాళ్ళం. మా సంఘం సంగతి తెలిగానే ఒక్కో తండ్రీ వచ్చి కొడుకు చెవిపట్టుకులాక్కెళ్ళి పెళ్ళిళ్లు చేసేశాడు. మాలో ఒక్క రఘురాముడు మాత్రం తండ్రితో తెంపేసుకుని విధవావివాహం చేసుకున్నాడు. పెళ్ళి విషయంలో నాకూ నాన్నకూ మధ్య ఎంతో యుద్ధం జరిగింది....

(క్షణం విరామం)

రాఘవయ్య: నాకిష్టమయిన పిల్లను చేసుకుంటాను. నా కష్టసుఖాలు నేననుభవిస్తాను. మీ మీద ఏ మాత్రం ఆధారపడను—అంటున్నాను కదా. ఇంకా ఏం చెయ్యను నాన్నా ?

తండ్రి: అవునురా అబ్బాయి. ఎంతసేపూ నీ గురించే మాట్లాడతావుగాని నీవు పుట్టి పెరిగిన కుటుంబం గురించి ఆలోచించవేంరా ? శారదకు పెళ్ళిచేయాలంటే కనీసం అయిదు ఆరువేలు కావాలి. అంతకు తగ్గితే జీవితావసరాలకు ఇబ్బందిలేని మనుషులు దొరకరు. అవునంటావా? నువ్వు నీకు నచ్చిన పిల్లను నచ్చిన విధంగా పెళ్ళాడి నీ జీవితాన్ని దిద్దుకుని సుఖపడతావు. మరి శారదను అలా పెళ్ళాడి సుఖపెట్టగలిగేవరుణ్ణి తీసుకురాగలవా?

రాఘవయ్య: అయితే ఏం చెయ్యమంటావు నాన్నా నాకేమీ బోధపడకుండా వుంది.

తండ్రి: ఇందులో బోధపడేందుకు ఏముందిరా ? మన ఆర్థిక పరిస్థితి నీకు తెలుసుకదా. సీతారామయ్యగారి అమ్మాయిని ఇస్తామన్నారు. మూడువేలు కట్నం. ఇంకా లాంఛనాలూ ముచ్చట్లూ వుంటాయనుకో. మొన్న శారదను చూడడానికి వచ్చిన వాళ్ళు సరిగ్గా అంతే అడిగారు. ఆ సంబంధం నువ్వు ఒప్పుకుంటే ...

రాఘవయ్య: ఒక చెల్లెలుండడం నాది తప్పా నాన్నా?

తండ్రి: నీదా నాదా, దానిదా. దాని ఆడజన్మదా, నామేస్టరు గిరీదా, కాబోయే అల్లుడిదా—అని తర్కించుతూ కూచుంటే సమస్యలు విడవు నాయనా. అది ఆడపిల్లగా మన యింటపుట్టడం చేత, బ్రతుకులో శుష్క భౌతిక కారణాలవల్ల అది బాధపడుతూంటే చూసి భరించలేం నాయనా! మనం చెయ్యగలిగిందేదో మనం చేద్దాం. మనుషుల్ని తిట్టుకునీ, మనసుల్ని నొచ్చుకునీ వీటిని పరిష్కరించలేం. మనిషి ప్రలోభాల మడతల్లో నలుగుతున్నప్పుడు ఇవి తప్పవు.

రాఘవయ్య: అంతే నంటావా నాన్నా!

తండ్రి: అంతేరా అంతే! నీచుట్టూవున్నవాళ్లు పందిరిమంచం, ఫాను, వుంగరం, జేబువాచి వగైరా హంగులతో వర్ధిల్లుతున్నప్పుడు. అవి నువ్వు సంపాదించుకోలేనప్పుడు, మామగారిద్వారా వచ్చే అవకాశాన్ని కాదనగలవా? ఈ ప్రలోభాల ప్రపంచంలో నీకోరికలు ఎన్నాళ్ళు నిద్రపోగలవో తెలుసుకోగలిగితే ఈ సత్యం నీకే రుజువవుతుంది.

(క్షణం విరామం)

ఇదే శాంతా జరిగిందిదే. ఆరోజునుండీ ఈ నాటి వరకూ ఒకక్షణంకూడా నాకోసం నేను బ్రతకలేదు.

ఆ సీతారామయ్య కూతురివి నువ్వే. కావలసింది కోమకోకమని అన్నింటా మీనాన్న డబ్బే ఇచ్చేశాడు. అదంతా అలా మాబావ అనుభవించాడు. ఒకసారి నువ్వు అడిగావు జ్ఞాపకముందా? ఏవస్తువా ఇంట్లో లేదేమని ఇదిగో అదిగో అంటూ దాటవేసేశాను.

ఇదీ నా అల్పజీవితం. నేనొక మందలోని గొర్రెని వయసులోని కాస్తంత చైతన్యమూ పురిటిలోనే చచ్చిపోయింది. నిజానికి నేనూ చచ్చిపోయాను.

కాని అల్లుడికి ఏ భయమూ లేదని నీకు తెలుసు. నీకు వేలువిడిచిన అన్న కొడుకని కట్నం పుచ్చుకోడని పట్టుపట్టి చేశావు. కట్నాన్ని మించి పోతున్నాయి నీ అల్లుడికోరికలు-నీవాళ్ళలో ఘనతకోసం ఆకోరికలు తీర్చడానికి తాపత్రయ పడుతున్నావు.

లక్షాధికారి ఏకైక పుత్రుడు. ఈ నాడు తండ్రి ఇవ్వకపోయినా తదనంతరమూ తనదే. అంతే కాదు జాగ్రత్తగా గడుపుకుంటే అవన్నీ తనే సంపాదించుకో గలిగే సంపాదనా పరుడు. అలాంటి అల్లుడికి మన ఈ పేద బతుకులమీద కాస్తయినా కనికారం లేదు కదా అనే బాధ.

ఎవరిబాధ ఎవరికి కావాలంటావా? అంతేలే అందుకనేగా నాకథనం వినకుండా వెళ్ళిపోయావు. పోనీలే గాని చిన్నప్పుడు మీ నాయనమ్మ చేయించిన ఈ గొలుసు గురించి ఎన్నెన్నో కథలు చెప్పావు. ఇప్పటివరకూ నిన్ను విడువకుండా ఎన్నో స్మృతులను దాచిపెట్టింది. ఇది అమ్మేయ్యమంటావా శాంతా? కాకపోతే ఇంకోదారేమిటి అంటావా! నిజమేలే. కొంచెం కాఫీ ఇస్తావా ...అలా బజారు వెళ్ళొస్తాను.

(వేకువవేళ భజనకూటం మేలుకొలుపులు పాడుకుంటూ సాగిపోతుంది).

(తలుపుతట్టిన చప్పుడు)

శ్రీహరి : పద్మా పద్మా....

శాంతమ్మ : (గడియ తీసిన చప్పుడు) ఏం నాయనా అంతా కులాసావా?....ఏమండోయ్ అల్లుడొచ్చాడు మీ మామగారు ఇప్పుడే పెరట్లోకి వెళ్ళినట్టున్నారు. పద్మ ఆగదిలోవుంది నాయనా ఇంకా లేవలే దల్లేవుంది.

శ్రీహరి : నేను చూస్తాన్లేండి మీరు పని చూసుకోండి.

(క్షణం విరామం)

పద్మ : ఈయనగారు దిగినట్టున్నారు. పట్టుదలకి మానాన్న వుత్తరం వ్రాసేవరకూ వున్నారుగాని లేకపోతే ఆ నాడే దిగబడేవారు. నాన్న ఎక్కడపుట్టించారో మొత్తానికి అల్లుడికోరిక నెరవేరు స్తున్నారు. పాపం నాన్నను చూస్తే జాలివేస్తుంది. నడిమి తరగతి బడుగుప్రాణిలా కనిపిస్తాడు. దేన్నీ కాదనడు. ఈ అల్లుడు కట్నం పుచ్చుకోలేదన్న సంబరం కూడా దీంతో పోయింది. అదిగో ఆయన వస్తున్నట్టున్నారు.

శ్రీహరి : పద్మా పద్మా లేవండోయ్! ఈ పద్మంకోసం అంతదూరంనుండి పదునుగ్రాల రథంమీద వుద యిస్తే...

పద్మ : గొప్పపనిచేశారు. కోరికలు తీర్చుకోడానికని చెప్పరు.

శ్రీహరి : అదిగో మళ్ళీ మొదటికొచ్చావు కోరికలు తీర్చుకోడానికి కాకపోతే బ్రతకడం ఎందుకు చెప్పు ముందు నీకు జీవితసూత్రాలు బోధించాలి

పద్మ : ఉద్ధరిస్తారు. తెల్లవారిపోతోంది పదండి అవతలికి. భోగిపండుగ కదా. తలంట్లుపోసుకోవాలి.

ఆకాశవాణి సౌజన్యం.



# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఅడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ.ఎస్.ఎల్.సి., పరీక్షలకు శిక్షణ. |
| పారిశ్రామిక విద్యాలయము | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము. |
| మహిళా మందిరము | : విద్యార్థినులకు వసతి గృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాల—అడయారులో నిర్మించబడినవి. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణ కూడ యివ్వబడుచున్నది. |
| ఆర్థోపీడిక్ సెంటర్ | : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమ కేంద్రం. |
| ముద్రణాలయము | : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూఫురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్కు చేయబడును. |
| నాగేశ్వర శిశువిహార్ | : పిల్లల విద్యావినోద కేంద్రం ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది. |
| వనితా బాలవిహార్ | . స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం |

## ఆంధ్ర మహిళా సభ, హైదరాబాదు

హైదరాబాదు శాఖ నిర్వహిస్తున్న కార్యక్రమాలు : (1) రీజనల్ హేండిక్రాఫ్ట్సు, (2) సంక్షిప్త విద్యాప్రణాళిక, (3) చేనేత శిక్షణ- ఉత్పత్తి కేంద్రము, (4) పౌర సంక్షేమ కార్యక్రమ పథకము. (5) వసతిగృహము.

Printed and Published by N. R. Chendur at Andhra Mahila Press, 7-A, Rosary Church Road San Thome, Madras-4. Hony. Editor : Mrs Malati Chendur